

తిరుమల తిరుపతి దేవస్థానములు

# సప్తగిరి

సచిత్రమాసపత్రిక

జూలై 2016 వెల రూ.5/-



గురు పరంపర పై
ప్రత్యేక సంచిక !

ఆచార్యః పూర్వరూపమ్ । అంతేవా స్యుత్తర రూపమ్
విద్యాసంధిః । ప్రవచనం సంధానమ్



వందే తురంగవదనం శశిబింబసంస్థం చంద్రావదాత మమృతాత్మకరై స్సమంతాత్।
అండాంతరం బహి రపి ప్రతిభాసయంతం శంఖాక్ష పుస్తకసుబోధయుతాబ్జబాహుమ్ ॥

శ్రీ హయగ్రీవస్వామి చంద్రుని వలె స్వచ్ఛమగు శరీరకాంతితో నాల్గుచేతులతో, చంద్రబింబమునందు నివసించును, బ్రహ్మాండముయొక్క అంతర్భాగమును (లోపల), బహిర్భాగమును (వెలుపల) అమృతమయములగు తన కిరణములచేత ప్రకాశింపజేయుచుండును.

# కుమ్మరించే రాజసమే గోవిందరాజు

కొమ్మలాలా ఎంతవాడె గోవిందరాజు
కుమ్మరించే రాజసమే గోవిందరాజు ॥

ఉలిపచ్చి నవ్వులతో ఒత్తిగిలి పవళించి
కొలువు సేయించుకొనీ గోవిందరాజు
జలజాక్షు లిద్దరును సరిపాదా లొత్తగాను
కొలదిమీర మెచ్చేని గోవిందరాజు ॥

అదె నాభికమలాన అజుని పుట్టించి తాను
కొదలేక వున్నవాడు గోవిందరాజు
చెదరక తన వద్ద సేవ సేసే సతులకు
గుదిగుచ్చే వలపులు గోవిందరాజు ॥

ఒప్పగా వామకరము ఒగిచాచి వలకేల
కొప్పు కదునెత్తినాడు గోవిందరాజు
ఇప్పుడు శ్రీ వేంకటాద్రి నిరవై శంఖుచక్రాలు
కుప్పె కటారము బట్టె గోవిందరాజు ॥

(సంపుటం 7- సంకీర్తన 470)

అన్నమయ్య సప్తగిరుల సార్వభౌముడైన శ్రీనివాసప్రభువును వేనోళ్ల కీర్తించిన పదకవితాసార్వభౌముడు. ఈయన తిరుమల క్షేత్ర దైవంతో పాటు క్షేత్ర పరిసరాల్లోని పరివార దేవతలను, ఆ యా క్షేత్రాలను సైతం కీర్తించాడు.

ఈ సంకీర్తనలో అన్నమయ్య తిరుమల కొండ దిగువున ఉన్న తిరుపతి పట్టణంలో ఉన్న శ్రీగోవిందరాజస్వామివారిని వర్ణిస్తున్నాడు. ఘనరాజసం ఉట్టిపడేటట్టు గోవిందరాజస్వామి శయనించి ఉన్నాడు. దేవేరులిరువురు స్వామివారి పాదాలు ఒత్తుతూ ఉండగా స్వామి కొలువు చేశాడని అన్నమయ్య అనేకవిశేషాలతో శ్రీగోవిందరాజస్వామిని సంకీర్తించాడు.



దారు విగ్రహశిల్పి - శ్రీ సి.సుబ్రహ్మణ్యం ఆచారి




## దినదినాభివృద్ధి

శ్రీవారిమానసపుత్రిక అయిన 'సప్తగిరి' ప్రతినెలా విశేష సంచికగా వెలువడుతూ అన్నికోణాల్లో దినదినాభివృద్ధి చెందుతున్నది. ఇంతకు ముందుకంటే ఇప్పుడు పత్రిక చాలా ఆకర్షణీయంగా, విలువైన వ్యాసాలతో పుస్తకం చూడగానే హృదయానికి హత్తుకోవాలనే అనుభూతి కలుగుతోంది.

*- బి.మట్టయ్య, శ్రీకాకుళం.*

## సమృద్ధిరస్తు!

'సప్తగిరి'ని రంగుల్లో చూడాలనే ఎన్నో రోజుల నా ఆకాంక్ష తీరింది. తి.తి.దే. యాజమాన్యానికి, సంపాద వర్గానికి ప్రత్యేక కృతజ్ఞతలు. ముఖ్యంగా వేదాలపై వెలువరించిన ప్రత్యేకసంచిక మాకు నాలుగు వేదాలను చదవాలి. వాటిలో ఏముందో తెలుసుకోవాలనే కుతూహలాన్ని రేకెత్తించింది. సప్తగిరి విషయసమృద్ధితో మరింత ముందుకు సాగాలని ఆ కలియుగ ప్రత్యక్షదైవాన్ని ప్రార్థిస్తున్నాను.

*- ఎన్.నిర్మల, చెన్నై.*

## 2016 ఆగష్టు నెల ఉత్సవాలు, పర్వదినాలు

**12** శ్రీవరలక్ష్మీ వ్రతం,
కృష్ణవేణీ నది పుష్కరాలు.

**13** తిరుమల శ్రీవారి పవిత్రోత్సవం ప్రారంభం.

**18** జంధ్యాలపూర్ణిమ,
హయగ్రీవజయంతి,
విఖనసజయంతి.

**25** గోకులాష్టమి.

## కృతజ్ఞతలు!

'సప్తగిరి' మాసపత్రిక ఈ జనవరి నెల నుండి రంగుల్లో, సచిత్రమాసపత్రికగా వెలువడుతూ అశేషపాఠకులను ఆకట్టుకుంటున్నది. ప్రతినెల పత్రికలో వస్తున్న ప్రత్యేక కథనాలు చాలా బాగుంటున్నాయని ఎక్కడెక్కడినుండో పాఠకులు మాకు ఉత్తరాల ద్వారా, ఈ-మెయిల్స్ ద్వారా, ఫోన్ల ద్వారా వారి స్పందనను తెలియజేస్తున్నారు. పాఠకుల ఆదరణే పత్రికల మనుగడకు శ్రీరామరక్ష!

చిన్న బులెటిన్‌గా ప్రారంభమైన సప్తగిరి దినదినాభివృద్ధి చెంది ఆరు భాషలకు విస్తరించి ధార్మికపత్రికల్లో అగ్రగణ్యమై నిలిచింది. ఇప్పటి వరకు ఉపసంపాదకుడిగా, సంపాదకుడిగా, ప్రధాన సంపాదకుడిగా సుమారు పాతిక సంవత్సరాలు ఈ పత్రికలో పాలుపంచుకున్నాను. ప్రస్తుతం పదవీవిరమణ చేస్తున్నాను. ఇన్ని సంవత్సరాలు నా పర్యవేక్షణలో పత్రికను ఆదరించిన పాఠకులందరికీ కృతజ్ఞతాంజలులు.

ఇక ముందుముందుకూడా ఆ నిత్యకల్యాణచక్రవర్తి కృపాకటాక్షాలతో నా తర్వాతివారు పత్రికను మరింత అభివృద్ధి పథంలోకి నడిపింపజేస్తారని మీకు తెలియజేస్తున్నాను.

*- డా॥ సి.శైలకుమార్, ప్రధాన సంపాదకుడు, తి.తి.దే.*

## మంచి సంప్రదాయం

'సప్తగిరి' మాసపత్రికలో శ్రీరామానుజాచార్యులవారి గురించి వస్తున్న ధారావాహిక మమ్మల్ని విశేషంగా ఆకట్టుకుంటోంది. అదేవిధంగా ఇటీవల రామానుజులవారిపై వెలువరించిన ప్రత్యేక సంచిక ద్వారా ఆ మహనీయుని గురించి ఎన్నో తెలీని విశేషాలు తెలుసుకున్నాం. ఇలా ప్రతినెలా ఏదో ఒక విశేషాంశంపై ప్రత్యేక సంచిక తీసుకురావడం మంచి సంప్రదాయం.

*- కె.విఘ్నేష్, బళ్లారి.*

## ఇన్ని ఉన్నాయా?

ఇన్ని రోజులు వేదాలు అంటే ఏదో స్వాములు చదివేవి అనే ఒక భావన మాకు ఉండేది. కానీ, ఈ నెల 'సప్తగిరి' సంచిక చూశాక, అందులోని విషయాలు చదివి తెలుసుకున్నాక, వేదాల్లో ఇన్ని ఉన్నాయా? మానవజీవితాన్ని ఋజుమార్గంలోకి నడిపించే దిక్సూచి వేదం అని అభిప్రాయపడ్డాం. మీకు ధన్యవాదాలు.

*- జి.వెంకటరమణ, నాయుడుపేట.*



వేంకటాద్రిసమం స్థానం
బ్రహ్మాండే నాస్తి కించన।
వేంకటేశసమో దేవో
న భూతో న భవిష్యతి ॥


తిరుమల తిరుపతి దేవస్థానముల సచిత్ర మాసపత్రిక

# సప్తగిరి

సంపుటి : 47 జూలై, 2016 సంచిక : 02


## ఈ నెలలో....



ముఖచిత్రం : గురుదేవో భవ!
వెనుకచిత్రం : శ్రీవారి ఆణివర ఆస్థానం (తిరుమల)


**గౌరవ సంపాదకుడు**
డా॥ డి. సాంబశివరావు, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి, తి.తి.దేవస్థానములు.

**పర్యవేక్షకుడు**
శ్రీ ఎన్.ముక్తేశ్వరరావు, ఐ.ఏ.ఎస్. (విశ్రాంత),
విశేషాధికారి, ప్రాజెక్టులు, తి.తి.దే.

**ప్రచురణకర్త-ప్రధాన సంపాదకుడు**
డా॥ సి.శైలకుమార్

**సంపాదకుడు**
డా॥ కె.రాధారమణ

**ఉపసంపాదకుడు**
డా॥ కంపల్లె రవిచంద్రన్

**ముద్రాపకుడు**
శ్రీమతి ఎమ్.గౌతమి, ఎం.బి.ఏ.,
ఉపకార్యనిర్వహణాధికారి(ప్రచురణలు & ముద్రణాలయం),
తి.తి.దే., తిరుపతి

**వర్ణ చిత్ర పుటలు**
శ్రీ పి.శివప్రసాద్

**రూపకల్పన**
శ్రీ బి.గురుకుమార్ రెడ్డి

సప్తగిరి మాస పత్రిక

విడి ప్రతి : రూ. 5/-
సం॥ చందా : రూ. 60/-
జీవిత చందా : రూ. 500/-
విదేశాలకు సం॥చందా : రూ. 850/-




24 గంటలు పనిచేసే తి.తి.దే. కాల్‌సెంటర్ ఫోన్ నెం.
0877 2277777 / 2233333



స్థలాభావం వల్ల 'తిరుమల విశిష్టత', 'శ్రీజనాబాయి' ధారావాహికలు ప్రచురించలేకపోతున్నాం. పాఠకులు గమనించగలరు



# వ్యాసపూర్ణిమ

వ్యాసుడు సాక్షాత్ విష్ణుస్వరూపుడు. 'మునీనామప్యహం వ్యాసః' అని భగవద్గీతలో ఈ విషయం స్పష్టం చేయబడింది. భగవంతుని అవతారాల్లో ప్రతిద్వాపరంలోనూ విష్ణువు వ్యాసుడై అవతరించి కర్మ, భక్తి, జ్ఞానాలను ప్రబోధం చేసి సమాజాన్ని ధార్మిక నిష్ఠలో నడిపిస్తాడని విష్ణుపురాణాది గ్రంథాలు పేర్కొన్నాయి. వ్యాసుడనేది వ్యక్తి నామం కాదు. అది ఆ వ్యక్తి చేసిన పనుల్ని బట్టి ఏర్పడిన దివ్యనామం. ఆ పదవిలో ఏ ముని ఉన్నా అతణ్ణి వ్యాసుడనే అంటారు. కనుక ఇప్పటికి గడచిన అన్ని ద్వాపర యుగాల్లో విష్ణువు వ్యాసరూప జ్ఞానావతారుడై అవతరించి సమాజసేవ చేశాడు. అంచేత వ్యాసుడు అవతరించిన ఆషాఢ శుద్ధపూర్ణిమను 'గురుపూర్ణిమ'గా పెద్దలు నిర్ణయించారు.

వ్యాసుని ప్రబోధానుసారం మానవుణ్ణి శాసించేది వివేకబుద్ధి – విచక్షణజ్ఞానం. ఆ బుద్ధికి లోబడి మానవుని సర్వశక్తులూ పనిచేస్తూండాలి. వ్యక్తి తన జీవితాన్ని అనిత్య మనుకొని, శరీరాన్ని, జీవితాన్ని అలక్ష్యం చేయరాదు. ఆ అనిత్యంనుండే నిత్యత్వాన్ని సాధించుకోవాలి. అనగా అనిత్యమై, అనిశ్చితమైన శరీరం ఉన్నప్పుడే, దాన్ని ఆశ్రయించి ఉండే గుణాల్ని మంచిమార్గంపై అభివృద్ధి పరచుకొని, తద్వారా సుస్థిరసామాజిక సుఖస్థితికి దోహదం చేయా లని వ్యాసునిఆశయం!

ఇంటి గుమ్మంలో పెట్టిన దీపం అటు బయటకు, ఇటు ఇంటిలోపలికి కూడా వెలుతురిచ్చినట్లే వ్యాసుడు తన పూర్వమున్న గురువులకు, తన కాలంలోని గురువులకు, తన తర్వాతి కాలంలోని గురువులకు కూడా తనలోని భగవత్ శక్తి వల్ల స్ఫూర్తినిచ్చినవాడు. దీనివల్ల ఆ మహాత్ముని జయంతిని 'గురుజయంతి'గా, 'వ్యాస పూర్ణిమ'గా భారతీయులందరూ జ్ఞానవిజ్ఞాన సంపన్నతకై నిర్వహించి ఆ మహాత్ముణ్ణి స్మరించుకొని తమ జీవిత రూపురేఖలు ధార్మిక, ఆధ్యాత్మిక మార్గంలో పయనించేటట్లుగా చేసుకుంటున్నారు.

మనమందరం ఈ వ్యాసపూర్ణిమనాడు మన గురుపరంపరను, వ్యాసభగవానుణ్ణి, మనసా, వాచా, కర్మణా స్మరించి వ్యాసవాఙ్మయాన్ని ఒక్కమారు సింహావలోకనం చేసుకొని సమాజ ధార్మికసేవలో ధర్మిష్ఠులము, కర్మిష్ఠులము, జ్ఞాననిష్ఠులము కావాలి.

ఉత్కృష్ట పర్వదినమైన వ్యాసపూర్ణిమరోజు పురాతనమూ, ప్రవిమలమూ అయిన భారతీయ గురుశిష్య సంప్రదాయాన్ని జ్ఞాపకం చేసుకొని ప్రతిహైందవుడూ గురువులందరికీ పరమగురువైన శ్రీని వాసుని కృపకు పాత్రులు కాగలరు గాక! ఈ సంప్రదాయ స్మరణంతో ఉత్తమస్ఫూర్తిని పొంది ఉత్తేజితుల గుదురు గాక! "ధర్మో రక్షతి రక్షితః" అన్న గురూపదేశం ప్రకారం గురుపూర్ణిమరోజు ధర్మాచరణకు పున రంకితమౌతూ సర్వజనాళి సర్వశుభాలు పొందాలని ఆకాంక్ష.

**అచతుర్వదనో బ్రహ్మా, ద్విబాహురపరోహరిః,**

**అఫాలలోచన శ్శంభు, ర్భగవాన్ బాదరాయణః.**



# వ్యాసం వందే జగద్గురుమ్

విద్వాన్, డా॥ పమిడికాల్వ చెంచుసుబ్బయ్య, 98481 11794



**వ్యాసమహర్షి భారతజాతిసంస్కృతికీ, భారతీయులదార్శనిక సంపదకూ పెట్టనికోట. ఈనాడు మనం చదువుకొంటున్న, చెప్పుకొంటున్న ఆర్యసంస్కృతి, ఆర్షసంస్కృతి, హైందవసంస్కృతి, భారతీయసంస్కృతి అనే వాటికి ఒక సుస్థిరరూపాన్ని కల్పించి, వాటికి భవ్యతను, దివ్యతను సిద్ధింపజేసిన భారతీయుడుగా మానవజాతికి మార్గదర్శకత్వాన్ని అందజేసిన మహనీయుడు. ప్రాతః స్మరణీయుడు. ప్రథమాచార్యుడు.**

**వ్యాసుడు ఒక వ్యక్తిగాదు. అనేక గురువుల జ్ఞానవిజ్ఞానసంప్రదాపుడు. వ్యాసునిచరిత్ర భారతచరిత్ర.** భారతీయులసుదీర్ఘచరిత్రలో, మానవునిజీవితాదర్శాలకు భాష్యం చెప్పిన మహామహులెందరో ఉన్నారు. మానవునిపరిపూర్ణతకు పరిభాషనిచ్చిన మాన్యులెందరో ఉన్నారు. అట్టి వారిలో పరాశరపుత్రుడయిన బాదరాయణవ్యాసుడు ప్రధానుడు. ఒకవిధంగా ప్రథముడుకూడా! ఈయన భారతజాతికి సమకూర్చిపెట్టిన సాంస్కృతికసాహితీఆధ్యాత్మికసంపద అపురూపమైంది. అద్వితీయమైంది. తరతరాలకూ చెక్కుచెదరంది.

వ్యాసుడు శ్రీమన్నారాయణుని మానసపుత్రుడని పురాణాలు పేర్కొన్నాయి. అంటే సాధారణ మానవునిశక్తికి అతీతంగా అద్భుతకార్యాలను సాధించిన విశిష్టవ్యక్తులకు దైవత్వాన్ని ఇచ్చి, వారిని భగవదవతారాలుగా భావించడం లోకసహజం. ఆ అవతారక్రమంలో పరశురాముడు 16వ అవతారం. వ్యాసుడు 17వ అవతారంగా నిర్ణయం. శ్రీరాముడు, శ్రీకృష్ణుడు 16, 19వ అవతారాలుగా కీర్తించబడ్డారు.

వ్యాసుని అసలు పేరు **"అపాంతరతముడు".** వ్యాసుడు అనేది ఇతనికి నారాయణు డిచ్చినబిరుదు. అన్నిమన్వంతరాలలో, భగవంతుని ఆదేశానుసారం ఇతడు జన్మిస్తూ, వేదవిజ్ఞానాన్ని పరిరక్షించేభారం వహిస్తుంటాడు. ప్రస్తుతవ్యాసమహర్షి వశిష్ఠునికి మనుమడైన పరాశరునికి జన్మించాడు (వశిష్ఠునిపెద్దకొడుకు శక్తి. శక్తిభార్య అదృశ్యంతి. వీరి కుమారుడు పరాశరుడు. పరాశరునికి సత్యవతియందు జన్మించినవాడు వ్యాసుడు). ఇతడు సరస్వతీనదీతీరంలో, బదరికారణ్యంలో ఒక ఆశ్రమాన్ని నిర్మించుకొని, అపూర్వసాధనచేసినమహర్షి. ఈయనకు జనసామాన్యంలో ద్వైపాయనుడు, కృష్ణద్వైపాయనుడు, బాదరాయణుడు, పారాశర్యుడు, సాత్యవతేయుడు– అనే పేర్లున్నాయి.

**తన అపారరచనలద్వారా భారతీయులకు మానవధర్మ నిరతినీ, న్యాయసంగతినీ ప్రబోధించినపుణ్యశీలుడు. ధర్మంమీద, జీవితంమీద, దేవునిపై, భక్తిపై, లోకంపై, పరలోకంపై, ఆస్తిక్య-నాస్తిక్యాలపై మానవునికి హేతుబద్ధమైన పరిశీలనదృష్టిని అందించి, అతనిజీవనసమగ్రతకు తోడ్పడిన మహామనీషి-వ్యాసుడు.**

వ్యాసుడు కాళిందీనదీపరిసరాల్లో సత్యవతికి పుత్రుడుగా జన్మించాడుగదా! యుక్తవయస్సునుండి ఆయన గోమతి, గంగా, యమునా, సరస్వతీనదీపరిసరాల్లో ఉండే మహర్షులకు శుశ్రూషలు చేసినాడు. మహాతపస్సు చేసినాడు. ముఖ్యంగా బ్రహ్మవంశజుడైన మహర్షి మయునివద్ద వేదశాస్త్రవిద్యల్ని అభ్యసించి, ఉద్దండ పండితు డయ్యాడు. అనేకపుణ్యక్షేత్రాలు దర్శించాడు. అపారమైన పారమార్థికజ్ఞానాన్ని సాధించాడు. ఆ తర్వాత నైమిశారణ్యంలో ఆశ్రమజీవితం గడపుతూ, స్థిరచిత్తుడై, సమగ్రజీవనతత్త్వ ప్రబోధకమైన మహాభారతగ్రంథాన్ని రచించాడు.

ఈయనపరిశోధనవల్లనే భారతీయులవేదం, ఋక్, యజుస్, సామ, అథర్వాలని నాల్గురూపాలుగా వెలుగొందింది. ఆ వేదాలను తనశిష్యులద్వారా లోకంలో

**"సర్వసుఖాలతో పాటు సర్వానర్థాలకూ మూలభూతమైన మనస్సును జయించడమే మానవునిమాన్యతకు పరమార్థం అని వేదసాహిత్యం చాటిచెప్పింది. వేదసాహిత్యం యొక్క ఈ మహత్తరమైన విలువల్ని సంరక్షించడమే వేదవ్యాసుని పరమలక్ష్యం!"**

వ్యాప్తికి తెచ్చాడు. **ఆ మహాకార్యంకూడా వ్యాసుని జన్మదినమైన ఆషాఢపూర్ణిమనాడే ప్రారంభమైంది. కనుకే దాన్ని 'గురుపూర్ణిమ'గా స్మరిస్తున్నాం.** పైలుడు, వైశంపాయనుడు, జైమిని, సుమంతుడు అనే తన శిష్యులద్వారా వరుసగా నాల్గువేదాలనూ లోకంలో ప్రచారం చేయించాడు. వ్యాసునికి మరొకశిష్యుడు సూతుడున్నాడు. ఇతడు వ్యాసుడు చెప్పిన పురాణేతి హాసాలనూ, సంహితలనూ నేర్చి, ప్రచారం చేసి, సూతపౌరాణికుడుగా పేరొందాడు. ఇలా **వేద విభాగం చేసి, ప్రచారం చేసినందున ఇతడు "వేదవ్యాసుడు" అయ్యాడు.**

వేదసంకలనమేకాక సుమారు 555 వాక్యాలు గల బ్రహ్మసూత్రాలు, 4 లక్షల శ్లోకాలుగల 18 మహాపురాణాలు, ఒక లక్షశ్లోకాలుగల 18 ఉపపురా ణాలు, 18 పర్వాలతో లక్షాఇరువదియైదువేల శ్లోకాలు గల మహాభారతం, ఇంకా ఎన్నో స్తోత్రాలూ మొద లగునవన్నీ వ్యాసరచనలే! ఎంత తక్కువగా అంచనా వేసినా మొత్తం **సుమారు $7^1/_2$ లక్షల శ్లోకాల వరకు వ్యాసునిప్రజ్ఞకు ప్రమాణంగా లోకంలో వెలుగొందు తున్నాయి. ఇంతరచన ఏయుగంలో- ఏ వ్యక్తీ నిర్వ హించలేదు. ఇది ఒక్క వ్యాసమహర్షికే చెల్లింది.**

వ్యాసుడు భారతీయులకు ఆది గురువు. వేద విజ్ఞానసాహిత్యసర్వస్వాన్ని ఆమూలాగ్రంగా పరి శోధించి, అవగాహనచేసుకొన్నాడు, గనుక ఆత్మ విశ్వాసంతో దాన్ని బహువిధాలుగా ప్రసారితంచేయ డానికి సంకల్పించాడు. అందుకు పవిత్రమైన ప్రణా ళికను రూపొందించుకొన్నాడు. వేలకొలది వేదబుక్కు లను సమీకరించి, సంస్కరించి, సంపాదితం చేసిన పిమ్మట, ఆ మహర్షి వేదాలలో నిక్షిప్తమై ఉండే విజ్ఞా నాన్ని **"వేదాంతదర్శనం"** ద్వారా (ఉపనిషత్తుల ద్వారా) లోకానికి అందించాడు.

555 సూత్రాలు, 4 అధ్యాయాలు గల బ్రహ్మసూత్రాలద్వారా వ్యాసుడు ఉపనిషత్తుల సారమైన బ్రహ్మవాదాన్ని మరింతస్పష్టం చేశాడు. ఈకృషి నైమిశారణ్యంలో జరిగింది. బ్రహ్మసూత్రాల్లో చర్చించిన బ్రహ్మ విద్యను లోకజీవితానికి అన్వయించి, వ్యాఖ్యానించేందుకే వ్యాసుడు అధ్యాత్మ రామాయణం, భారతం, భాగవతంవంటి ఉత్తమనిరుపమాన గ్రంథాలు రచించాడు. ఇవి భారతీయుల జీవనసర్వస్వాలుగా స్థిరంగా నిల్చాయి.

అసలు వ్యాసుడు భారతభాగవతాలద్వారా నివృత్తి ప్రధానమైన ప్రవృత్తినీ, కర్మప్రధానమైన జ్ఞానాన్నీ, త్యాగనిరతి గలభోగాన్ని, దేహాన్ని వదలనిఆత్మనూ ప్రబోధించేందుకే శ్రీకృష్ణునిపాత్రను సృజించినట్లు తెలుస్తోంది. వాసుదేవుడు వ్యాసదేవునిఆలోచనలకు, ఆదర్శాలకు ప్రతినిధి కదా! కనుకనే **"వ్యాసాయ విష్ణురూపాయ, వ్యాసరూపాయ విష్ణవే"** అన్నారు. **ఇరువురూ ఒక్కరే!**

భారతంలో ధర్మార్థకామమోక్షాల్ని సముచితస్థాయిలో మేళవించి, సమగ్రజీవనదర్శనాన్ని రూపొందించాడు. ఆ దర్శనంలో ఈనాటికీ మానవజాతి ఆచరించగల జీవనఆదర్శాలు ఎన్నో రూపుదిద్దుకొని, రాణిస్తున్నాయి. కనుకనే వ్యాసమహర్షి ప్రపంచమానవజాతుల మధ్య భారతజాతికి ఒక గొప్ప గురుస్థానాన్ని సంపాదించిపెట్టాడు. తానూ గురు స్థానంలో పూజలందుకొంటున్నాడు - నేటికీ!

వ్యాసునిది యోగదృష్టి. వ్యాసునంతటిసాహిత్యాన్ని సృష్టించిన 'వ్యక్తి న భూతో న భవిష్యతి'. ఆయన అతీంద్రియవిషయాలపై సైతం యథార్థ జ్ఞానాన్ని సాధించిన ఋషిపుంగవుడు. ఆయన ప్రత్యక్ష సంబంధాలద్వారా, అనుమానప్రమాణాలద్వారా తన మంచిచెడులను తాను తెలుసుకోగలడు. సాటివారికి తెలియజెప్పగలడు. జాతికి మార్గ దర్శకత్వాన్ని ఇవ్వగలడు.

***వ్యాసుడు లోకజీవితాన్ని నిరసించినవట్టివిరక్తుడు గాడు. విరక్తి అతనిసాధుధర్మం కాదు. పాక్షికమైన ఋషిధర్మం. ఆయన అనురాగంతో కూడిన లోకధర్మాన్ని ప్రవచించిన విలక్షణసాధుపుంగవుడు.*** ఆయనకు జీవితం ఒకసాధన! అది సమ్మెల్ని చూచి పరుగెత్తేది కాదు. బుద్ధిని, సిద్ధిని అభిలషించాడు. పరాయణత్వాన్ని పరమధర్మంగా భావిస్తూ, ప్రబోధాన్ని పరమాశయంగా స్వీకరించిన ఋషిపుంగవుడు.

**"బ్రహ్మజ్ఞాన మంటే - మానవుడు తనజీవితంలో తనకు సహజంగా సంక్రమించిన సామాన్యభ్రమలను తొలగించుకొని, తన సత్యాన్ని (నిజస్థితిని) తాను తెలుసుకొనేందుకు ఉపకరించగల అనుభవాత్మకసందేశజ్ఞానం."**

వ్యాసుని గీతాసందేశం మానవజీవితాన్ని కాచి, చల్లార్చి, వడ బోసిన శీతలపానీయం అని చెప్పవచ్చు. మనమనస్సుల్ని ఆవరించి ఉండే చీకట్లను పోగొట్టే విద్యుద్దీపం గీత. దేశకాల జాతివర్ణమత మర్యాదలకు అతీతమైన, విశ్వజనీన మానవధర్మాన్ని వైజ్ఞానికదృక్ప థంతో ప్రవచింపజేసే నిర్మల ప్రయత్నమే గీతారచన! గీతకు ఏ మతంతోనూ విరోధం లేదు. అది మానవజాతికి కృష్ణునిద్వారా అందిం చిన దివ్యసందేశం.

"నీకు కష్టమైంది, దుఃఖకరమైంది - ఇతరులకు చేయవద్దు" (ఆత్మనః ప్రతికూలాని, పరేషాం న సమాచరేత్) - ఇదే వ్యాసుని ధర్మసర్వస్వం!

వ్యాసునిసిద్ధాంతంలో అన్నిటికీ మూలం ధర్మం. ఇదే అర్థకామ మోక్షాలకు ఆధారం. ధర్మం వ్యక్తికి మోక్షాన్ని సమకూర్చడానికి ముందు, ఐహికజీవితాన్ని వ్యవస్థితం చేయడంలో అధికంగా రాణిస్తుం దని వ్యాసునిఅభిమతం! ఆత్మసాక్షాత్కారానికి గానీ, ఆత్మశుద్ధికి గానీ ధర్మాచరణ అవసరం. ధర్మానికి నిజంగా దగ్గరిచుట్టం దైవంకాదు. దైవత్వం గల మనిషి. ధార్మికవ్యవస్థకు శక్తి నిచ్చేది మానవునిపరలోక విశ్వాసం కాదు-లౌకికజీవితంలో ఋజువర్తన. ఇట్టి సామాజిక స్పృహ గల్గి, కర్తవ్యనిష్ఠతో జీవించడమే ధర్మానికి అలంకారం. ఉత్తమమానవ జీవితమే ధర్మం. ఇదే సామాజికఆదర్శం.

మనిషి ఒకదేవతగా ప్రజలమధ్యకు రావడంకంటే, ఒక మనిషిగా దేవతలమధ్య నిలబడగల్గే అర్హత సాధించడం పరమావధిగా భావిం చాలి. మనిషి సద్గుణసంపత్తిగల్గి, నీతి నిజాయితీలనే ఆభరణాలుగా భావిస్తూ, తన పవిత్రాచరణవల్ల ఆదర్శమానవుడుగా ఒక అర్హతను సాధించాలి. అట్టి అర్హతనే ఆరాధించాలి. వ్యాసునిదృష్టిలో సద్బుద్ధితో కర్మలు చేయడం "యోగః కర్మసు కౌశలం" అవుతుంది.

మంచితనం అనేది ఏ ఒక్కని సొత్తూ కాకుండా - అది సంఘ సంస్కారంగా రూపుదిద్దు కోవాలి - ఇది వ్యాసుని సిద్ధాంతం.

ఇలా వ్యాసమహర్షి మానవజీవితాన్ని సన్మార్గంలో నడిపించడం కోసం తనసర్వశక్తుల్నీ ధారపోసిన మహాత్యాగి. ఉత్తమప్రబోధం చేసినగురువర్యుడు. నిస్స్వార్థ సంఘసేవాశీలి. మహాకవి. గొప్పతాత్త్వి కుడు. ఋషీశ్వరుడు.

"వ్యాసో నారాయణో హరిః" కనుకనే ఆషాఢపూర్ణిమను గురు పూర్ణిమగా నిర్ణయించి, వ్యాసుని జన్మజయంతిని భక్తిశ్రద్ధల్తో నిర్వ హించి, ఆయన మనకు చేసిన సేవలకు కృతజ్ఞతగా అతని

"వ్యాసుడు తనరచనలద్వారా సత్యనిష్ఠాశ్రితమైన లోక జీవితాన్ని నిర్వచించాడు. ధర్మబద్ధమైన మానవజీవన వ్యవస్థకు రూపుదిద్దాడు. పాపపుణ్యాలు, స్వర్గనరకాలు సృష్టించి, ఆ వ్యవస్థకు చిరంతనత్వాన్ని ఇచ్చాడు. ఆ మహర్షి ఆలోచనలనకు, ఆదర్శాలకు పరమావధి మానవశ్రేయస్సు. ఆయన అభిమానించి, ప్రతిపాదించిన అద్వైతం ప్రపంచ ప్రఖ్యాతిని ఆర్జించింది.

వ్యాసుడు రచించిన కథాగ్రంథాలు మానవునిసమగ్ర జీవితానికి, జీవనరహస్యాలకు, లక్ష్యాలకు, ఆదర్శాలకు, ప్రాతినిధ్యం వహించే మహత్తర రచనలు. మానవజీవితంలో ఎదురయ్యే అన్నిసమస్యలూ, వాటిపరిష్కారమార్గాలూ వ్యాసుని గ్రంథాల్లో దృష్టాంత పూర్వకంగా ఉన్నాయి."



మాహాత్మ్యాన్ని ఒక్కమారు ఈ పూర్ణిమనాడయినా మననం చేసుకొని - ధన్యులం, కృతార్థులం కావాలి.

"సర్వేజనా స్సుఖినో భవంతు"



# శ్రీవారి ఆణివర ఆస్థానం

- ఆచార్య వేదాన్తం శ్రీ విష్ణుభట్టాచార్యులు , 94907 41414

**కలియుగ ప్రత్యక్షదైవమైన శ్రీ వేంకటేశ్వరస్వామికి ప్రతిరోజూ ఉత్సవాలే! శ్రీవారు నిత్యకల్యాణచక్రవర్తి. ఆయనకు జరిగే ఉత్సవాలకు, జరుపుకునే పర్వదినాలకు కొదువలేదు. ఆయన సన్నిధిలో జరిపే ప్రతి ఉత్సవమూ ఒక ప్రత్యేకతను సంతరించుకున్నదే! ఆ ఉత్సవాల పరంపరంలో ఆణివరఆస్థానం ముఖ్యమైంది.**



**జూలై 16 ఆణివరఆస్థానం సందర్భంగా.....**

## దక్షిణాయన పుణ్యకాలం

ఆడిమాసం అంటే కర్కాటక మాసం. కర్కాటకం నుండి ధనుస్సు అంతంవరకు గల సూర్య సంచార ఆరుమాసాలకాలం దక్షిణాయనం. అంటే కర్కాటక సంక్రమణ సమయం దక్షిణాయన పుణ్యకాలం.

## శ్రీవారికి దక్షిణాయనపూజ

తిరుమల శ్రీనివాసునికి ఆ దక్షిణాయన ప్రారంభపుణ్యకాలంలో విశేషపూజ జరపాలనే సంకల్పంతో ఏర్పడిందే ఆణివర ఆస్థానం. అసలు పేరు ఆడిపూజ అదే ఆణివర్ అయింది. తమిళ సంస్కృతి ప్రభావంతో 'డ' 'ణ'గా మారి, ఆణివర్ అయి ప్రసిద్ధి చెందింది అని చెప్పవచ్చు. ఈ విశేషపూజలో స్వామివారికి వచ్చే సంవత్సర ఆదాయం- అదే విధంగా ఆర్థిక సంవత్సరం ఆరంభంగా ఏర్పడి ఈరోజు నుండి అధికారులు మార్పు చెంది, పరిపాలన సక్రమంగా జరుపడానికిగాను స్వామివారి వద్ద వినతులు సమర్పించి, అధికారాన్ని పూర్వం పొందినట్లుగా మనం ఊహించవచ్చు.

## ఆచరించే విధానం

శ్రీ భూదేవీసమేత మలయప్పస్వామిని సర్వభూపాల వాహనంలో ఉంచి, విష్వక్సేనులవారిని చిన్నపీఠంపై ఉంచి అలంకరించి, అధికార - అనధికార - అర్చక పరిచారక గణం పరివేష్ఠితులై ఉండగా- విశేష ఆరాధన విశేష ప్రసాద నివేదనాదులు జరిపి, స్వస్తి సూక్తాన్ని అర్చక బృందం పఠించి, స్వామివారికి అక్షతారోపణం చేస్తారు. విష్వక్సేనుల వారికి శఠారిని ఉంచి హారతులు జరిపి స్వామివారియొక్క కానుకలను ఒక డబ్బాలో వేసి, ఆ డబ్బాను శిరస్సుపై ఉంచుకొని, స్వామివారి హుండీలో వేసి, స్వామికి వివిధ ఉపచారాలు సమర్పించి, చందన అక్షతప్రసాదాల్ని గ్రహిస్తారు. ఇదే ఆణివర ఆస్థానం. స్వామివారియొక్క బంగారు వాకిలి తాళాలు కూడా వారి వారికి అప్పగించటంకూడా ఈ ఆస్థానంలో ఒక విశేషం.

**పుణ్యకాలంలో పుణ్యకార్యాలు చేయటం విశేష సంస్కృతి. ఆణివర ఆస్థానసమయంలో స్వామిని కొలవటం, సేవించటం కీర్తించటం, ధ్యానించటం స్వామిసాక్షిగా పుణ్యకార్యాలు ఆరాధించటం జన్మసాఫల్యతకు, భగవదనుగ్రహ ప్రాప్తికి సోపానమే!**

## సాయంకాలం పుష్పపల్లకి

సాయంకాలం శుభసంధ్యావేళ ఉత్సవమూర్తులకు అంగరంగవైభవంగా వివిధపుష్పసుగంధ సౌకుమార్యంతో నేత్రపర్వంగా పల్లకిని తయారుచేసి, అందు దేవేరుల మధ్య మలయప్పను ఉంచి, ఛత్రచామర రథ గజ తురగ రాజలాంఛనాలతో అధికార అనధికార బృందం శ్రీవారిని సేవిస్తూ ఉండగా-శ్రీవారి పుష్పపల్లకిసేవ వేదవీథులుగా పిలువబడే నాలుగుమాడవీథులలో ఉత్సవం జరుపబడుతుంది.



ఎవ్వరైతే స్వామిని పుణ్యకాలంలో విశేషపూజ జరిపి, ధన్యులవుతారో వారికి కీర్తి విజయం ఇష్టకామ్యార్థ సిద్ధి, విష్ణులోక ప్రాప్తికి పాత్రులు కాగలరని ఆగమవచనం.

*వినా వేంకటేశం ।*
*న నాథో న నాథః ॥*

# వ్యాసగురుపూర్ణిమ

- బ్రహ్మశ్రీ సామవేదం షణ్ముఖశర్మ



**భారతీయ సనాతన హైందవ ధర్మానికి ఒక ప్రవక్త అంటూ లేడు. ఒక గ్రంథమంటూ లేదు. కానీ, వేదాధారంగా విస్తరిల్లిన ఆగమ, పురాణ, ధర్మశాస్త్ర, ఇతిహాసాలన్నింటికీ ఒకే ఒక కర్తగా ఎవరినైనా చెప్పుకోవలసి వస్తే, శ్రీ వేదవ్యాసుణ్ణే ప్రస్తావించాలి. సమస్తభారతీయసంస్కృతికీ అతడే జగద్గురువు.**

ఆషాఢమాసంనుండి నాలుగునెలలపాటు 'చాతుర్మాసం' అనే పేరుతో దీక్షను పాటించడం సనాతనసంప్రదాయం.

సన్యాసులకు, గృహస్థులకుకూడా వారివారి నియమానుసారం ప్రత్యేకదీక్షలు చెప్పబడ్డాయి. నారాయణుడు యోగనిద్రలో ఉన్న ఈ సమయంలో అంతర్ముఖమైన అధ్యాత్మ సాధనలకు అనుకూలం.

ఆషాఢంనుండి కార్తికంవరకు వచ్చే అయిదు పూర్ణిమలకు 'వ్యాసపూర్ణిమ'లు అని పేరు. వేదవ్యాసుణ్ణి స్మరిస్తూ ఆషాఢపూర్ణిమను 'గురుపూర్ణిమ'గా వ్యవహరిస్తారు.

భారతీయ సనాతన హైందవ ధర్మానికి ఒక ప్రవక్త అంటూ లేడు. ఒక గ్రంథమంటూ లేదు. కానీ, వేదాధారంగా విస్తరిల్లిన ఆగమ, పురాణ, ధర్మశాస్త్ర, ఇతిహాసాలన్నింటికీ ఒకే ఒకకర్తగా ఎవరినైనా చెప్పుకోవలసి వస్తే, శ్రీ వేదవ్యాసుణ్ణే ప్రస్తావించాలి. సమస్తభారతీయసంస్కృతికీ అతడే జగద్గురువు. సర్వఋషులవాణినీ సమీకరించి, సమర్పించిన ఆచార్యుడు.

ద్వాపరయుగాంతంలో అపారమైనవేదరాశిలో ఒక దాన్ని స్వీకరించి, నాలుగువేదాలుగా విభజించి, అష్టాదశ పురాణాలను రచించి, ఆపై మహాభారతాన్ని, భాగవతాన్ని రచించి- వివిధపద్ధతులతో విస్తరిల్లిన సమగ్రధర్మాన్ని ఏకత్ర అందించిన నారాయణావతారం వ్యాసుడు.

వేదవ్యాసుని అసలుపేరు కృష్ణుడు.

సత్యవతీపరాశరులకు ద్వీపంలో ఉద్భవించి నందున ద్వైపాయనుడని పేరు. వేదాలను వ్యాసంచేయడం చేత వ్యాసదేవుడు. మన సమస్తధర్మాలకూ, సాహిత్యాలకూ, వ్యాసుడే మూలం.

'వ్యాసోచ్ఛిష్టం జగత్సర్వం' - వ్యాసుని ఉచ్ఛిష్టమే (ఎంగిలే) ఈ జగతిలోని సమస్తవాఙ్మయం. ప్రపంచానికే జ్ఞానజ్యోతి వ్యాసుడు.

లక్షశ్లోకాల మహాభారతం- సర్వశాస్త్ర, సర్వధర్మ సమన్వయగ్రంథం. ఈ గ్రంథంద్వారా జగద్గురువు అందించిన విజ్ఞానం అపారం. భగవద్గీత, యక్షప్రశ్నలు, విష్ణుసహస్రం, శివసహస్రం, వివిధ ఉపాఖ్యానాలు.... ఇలా విస్తారమైన విషయాలతో కూడిన అద్భుతసాహిత్యసృష్టి మహాభారతం.

**యదిహాస్తి తదన్యత్ర, యన్నేహాస్తి న తత్ క్వచిత్॥**

"ఇక్కడ ఏదుందో అదే ఎక్కడైనా ఉంది. ఇక్కడ లేనిది ఎక్కడా లేదు" అనివ్యాసుడే స్వయంగా భారతం గురించి చెప్పినమాట. మానవనాగరితకు భారతీయ సంస్కృతిపరివర్తనం - ఇది.

వ్యాసదేవుణ్ణి గురించి భారతంలో వైశంపాయనుడు (వ్యాసునిశిష్యుడు) స్వయంగా వివరించిన విషయం:

సృష్ట్యారంభంలో బ్రహ్మదేవునిచతుర్ముఖాలనుండి నారాయణుడు వేదవిద్యను ప్రసరింపజేశాడు. దానిని లోకాలలో వ్యాప్తి చేయడానికి విష్ణువే తన అంశతో తన తేజస్విని ఆవిర్భవింపజేశాడు. అతనిపేరు **'అపాంతరతముడు'**– 'లోపలి చీకటిని' (అజ్ఞానాన్ని) తొలగించేవాడు.

విష్ణువుకు ఆత్మజుడు – అని ఖ్యాతి పొందిన ఈ ఘనుడే వివిధకాలాలలో వివిధనామాలతో అవతరించి లోకంలో వేదధర్మాన్ని ప్రతిష్ఠిస్తాడు.

**వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే ।**
**నమో వై బ్రహ్మనిధయే వాశిష్ఠాయ నమో నమః॥**

అని వ్యాసుని వేదనిధియైన విష్ణువుగా ఆరాధించుతాం. అపాంతరతముడే ఈ వైవస్వతమన్వంతరంలో పరాశరునిపుత్రునిగా ఉద్భవించాడు. పరాశరునితండ్రి శక్తి. అతడితండ్రి వసిష్ఠుడు.

ఈ పరంపరను తెలియజేస్తూ....

**వ్యాసం వసిష్ఠ నప్తారం శక్తేః పౌత్ర మకల్మషమ్,**
**పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్.**

'వసిష్ఠుని మునిమనుమడు, శక్తిమనుమడు, పరాశరునిపుత్రుడు, శుకునితండ్రి– అయిన తపోనిధి వ్యాసునికి వందనం" అని కీర్తిస్తారు.

మహాభారతవంశానికి మూలపురుషుడుకూడా వ్యాసుడే. తమ దివ్యశక్తితో నిరంతరం వైకుంఠానికి వెళ్ళి, నారాయణుణ్ణి ఆరాధిస్తున్న ఘనుడు ఈ వ్యాసుడని మహాభారతం చెబుతోంది.

నారదమహర్షి ప్రేరణతో భాగవతాన్ని అందించింది ఇతడే. భారతీయధర్మంలో శాక్తేయులైనా, వైష్ణవులైనా, శైవులైనా, సౌరులైనా, గాణపత్యులైనా, కౌమారులైనా ఏ ఉపాసనాసంప్రదాయానికి చెందనవారైనా వ్యాసుణ్ణి గురువుగా అంగీకరిస్తారు.

**ధర్మమార్గానికీ, మోక్షమార్గానికీ, జ్యోతిష ఆయుర్వేదాది విద్యలకూ కూడా ఆచార్యులు వేదవ్యాసులవారే. వీరు చెప్పినవిద్యలను అనుసరించి, బోధించేవారే అసలైన గురువులు. అందుకే వ్యాసపూర్ణిమనాడే 'గురుపూర్ణిమ'గా, అందరూ తమ తమ గురువులలో వ్యాసదేవుణ్ణి సంభావించి సమర్చనచేస్తారు.**

వ్యాసునినుండి మనదాకా బ్రహ్మవిద్యను తీసుకు వచ్చినందుకు గురువు పూజ్యుడు. వ్యాసవాక్యం అంటే భారతీయులకున్న గౌరవం కారణంగానే, చాలా గ్రంథాలు 'వ్యాసకృతం'గా ప్రసిద్ధి చెందాయి. వాటిలోనూ వ్యాస హృదయమే ఉంది కనుక ప్రామాణికంగా భావించారు.

**కాలములకీడుకతమున గలగబడిన**
**వేదముల నీవు నాడును విమల బుద్ధి**
**నంచితవ్యాస మొందించి యఖిలదివిజ-**
**మునిగణముల కొనర్తు సమ్మోద మనఘ ।**

**ధర్మసందేహములు నీవు నిర్మలంపు**
**వాక్యముల బాపి, జగములవారలెల్ల**
**నఖిల సంశయచ్ఛేత్త పుణ్యాత్మకుండు**
**లోకహితవాణి యనగ సుశ్లోకు డగుదు**

**(ఆంధ్రమహాభారతం- తిక్కనగారిరచన)**

వేదాలను, నిర్మలబుద్ధితో వ్యాసంచేసి, అఖిలదేవ మునిగణాలకు ఆనందాన్ని కలిగించే పుణ్యమూర్తివి నీవు.

ధర్మసందేహాలను నిర్మల (దోషంలేని) వాక్యాలతో తొలగించి, జగతిలోని జనుల సందేహాలను నిర్మూలించే పుణ్యస్వభావుడవైన నీమాట 'లోకహితవాణి'గా పేరు పొందుతుంది. నువ్వు సుశ్లోకుడవు" అని సాక్షాత్తుగా విష్ణువే పలికిన మాటలు.

ఇంతకంటే వ్యాసుని గురుత్వానికి ప్రమాణం వేరే అవసరం లేదు.



# ఆదిగురువులు

- శ్రీమతి పి. విజయలక్ష్మి

**అజ్ఞానమనే చీకటిని పోగొట్టి, జ్ఞానమనే కాంతిని ప్రసాదించేవాళ్లందరూ గురువులే. ఈ గురువులందరికీ ఒక ఆది గురువుండాలి కదా! వైష్ణవసంప్రదాయంలో ఆదిగురువు ఆది విష్ణువే! అందుకే విష్ణుసహస్రనామస్తోత్రంలో విష్ణుదేవుణ్ణి "గురుః, గురుతమః" అని నుతించారు.**

**శ్రీమన్నారాయణుడు మొట్టమొదలు బ్రహ్మకు జ్ఞానాన్ని ప్రబోధించినందున ఆ స్వామి ఆదిగురువు. శ్రీహరి గురురూపంతో సర్వవిద్యల్నీ ఉపదేశిస్తాడు. సర్వాన్నీ పుట్టించేవాడూ గురువే!**

విష్ణుదేవుడు లోకశ్రేయస్సును కోరి, మొట్టమొదట హయగ్రీవుడై అవతరించాడు. ఇది జ్ఞానావతారం. వాసుదేవుని అన్ని అవతారాల్లో ఇదే మొట్టమొదటిది. అన్నిటికీ మూలం జ్ఞానమే! హయగ్రీవు డంటే గుర్రం మెడవంటి మెడ కలవాడు. గుర్రం సకిలించేధ్వనిని 'హేష' అంటారు. ఈ ధ్వని ప్రణవరూపంగా భగవంతుడైన హయగ్రీవస్వామినుండి వెలువడింది. కనుక ఈ హేషాధ్వనిప్రభావం మహత్తరం. సృష్టియజ్ఞంలో విరాడ్రూపుని నుండి మొట్టమొదట వెలువడింది - అశ్వం. "తస్మా దశ్వా అజాయంత" (పురుషసూక్తం) అని వేదం పేర్కొనింది. హయమంటే శీఘ్రంగా పోయేదని వ్యుత్పత్తి. సృష్టిలో మొదటిరూపం కనుక హయగ్రీవావతారాన్ని భగవంతుని ప్రథమావతారంగా మహర్షులు నుతించారు.

'హేషా' అంటే అవ్యక్తంగా మ్రోగేది. సాక్షాద్విష్ణువే ఈ హయగ్రీవస్వామి కనుక సర్వత్ర గమనశక్తి, సర్వవ్యాపకత్వం, శీఘ్రగామిత్వం కల్గి, ప్రణవ (ఓంకారం) స్వరూపుడై- హయగ్రీవుడు జ్ఞానదాత అయిన ఆదిగురువు అయ్యాడు. ఈ స్వామి విద్యామూర్తి. ఈయన జ్ఞానానందమయుడు. నిర్మలమైన స్ఫటికంవంటి ఆకారం కలవాడు. సర్వవిద్యలకూ ఆధారమైనవాడు. హయగ్రీవుడనే రాక్షసుణ్ణి ఈ రూపంతో సంహరించాడనీ, మధుకైటభుల్ని ఈ రూపంతో కూల్చి, వేదాలు ఉద్ధరించాడనీ పురాణాలు పేర్కొన్నాయి.



**హయగ్రీవస్వామిని పూజించడానికై మొదట బ్రహ్మ తన భార్యయైన సరస్వతిని నియమించాడు. ఆమె ఈ మూర్తికి విగ్రహరూపం కల్పించుకొని పూజించింది. శ్రీరామానుజులవారూ, శ్రీవాదిరాజులవారూ ఈస్వామిని సేవించే మహాజ్ఞానులయ్యారు.**

సరస్వతి రామానుజులవారికి సాక్షాత్కరించి, కాశ్మీరంలో శ్రీ లక్ష్మీహయగ్రీవమూర్తిని ప్రసాదించింది. వారినుండి - వారి శిష్యులు పిళ్లైగారికి, వారినుండి వేదాంతదేశికులవారికీ గురుశిష్యక్రమంలో సంక్రమించింది. ఆ దివ్యవిగ్రహమే నేడు మైసూరులోని శ్రీ బ్రహ్మతంత్ర స్వతంత్రపరకాలమఠంలో ఆచార్యులచే అర్చించబడుతూంది. ఇలా భూలోకంలో హయగ్రీవమూర్తి పూజ మొదలైంది.

వేదాంతదేశికులవారు శ్రీ హయగ్రీవస్తోత్రంలో హయగ్రీవస్వామిని త్రిమూర్త్యాత్మకునిగా, అందుకు మూలమైన పరమాత్మగా నుతించారు. దేవలోకంలోనూ, భూలోకంలోనూ జ్ఞానమూర్తిగా, జ్ఞానదాతగా గురుస్థానీయుడై నతులూ, నుతులూ అందుకొన్న ఆదిగురువు - హయగ్రీవులవారు. ఈ ఆదిగురువును ఉపాసించేవారికి భౌతికవిద్యలే కాక- పురుషుడు పురుషోత్తముడు కాగల ఆధ్యాత్మికజ్ఞానమూ సిద్ధిస్తుంది. సంసారసముద్రాన్ని దాటడానికి హయగ్రీవునిదయ నావ. హయగ్రీవస్వామి వారి ఆలయాలూ, మందిరాలూ ఉన్నాయి.

విద్యార్థులు ప్రతిదినం ఉదయం-

**జ్ఞానానందమయం దేవం, నిర్మలస్ఫటికాకృతిమ్ ।**
**ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే**

అని నుతించడంవల్ల ఉత్తమవిద్యాసంపన్నులు కాగలరు.

## శ్రీ దక్షిణామూర్తిస్వామి

శైవ, స్మార్తసంప్రదాయాల్లో పరమశివునిరూపాల్లో ప్రముఖమైన శ్రీదక్షిణామూర్తి విద్యాదాత అయిన ఆది గురువు. శివుడు ఆదిగురువు కనుక – ఆ స్వామి రూపమైన దక్షిణామూర్తీ ఆదిగురువే! మాయకు అతీతంగా శుద్ధసత్త్వస్థితిలో ఉండి, తనఆత్మను తాను దర్శిస్తూ, జ్ఞానముద్రతో మర్రిచెట్టుక్రింద కూర్చొని, దక్షిణాభిముఖుడై శోభిస్తూ, అజ్ఞానమనే మృత్యుభయాన్ని పోగొట్టే రూపం – దక్షిణామూర్తి. ఈ స్వామినే 'మేధాదక్షిణామూర్తి' అనీ అంటారు. ఈయన జ్ఞానమూర్తి, జ్ఞానదాత. వీరిని గూర్చి–ఒక ఆశ్చర్య సన్నివేశం చెప్తారు. "ఆ మర్రిచెట్టుక్రింద ఒక యువకు డున్నాడు. ఆయనవద్ద వృద్ధులైన వసిష్ఠాదిఋషులు జ్ఞానసిద్ధికై కూర్చొని ఉన్నారు. గురువుమాత్రం సదా మౌనముద్రలోనే ఉంటాడు. శిష్యులూ అక్కడ మౌనంగా ఉంటారు. కానీ ప్రశ్నోత్తరాలతో అవసరం లేకుండానే ఆ శిష్యులసందేహాలన్నీ తొలగుతున్నాయట!" సూర్యునిసన్నిధిలో ఉండేవాళ్లకు వెల్తురూ, వేడీ కోరకుండానే లభించినట్లు ఆదిదేవుడైన





పరమేశ్వరుడు – దక్షిణామూర్తియై ఉంటే – సాన్నిధ్యమాత్రంతోనే సందేహాలు తీరడంలో ఆశ్చర్యంలేదు. దక్షిణామూర్తిని ఉపాసించి, ఎందరో జ్ఞానవిద్యావంతులయ్యారు.

తిరుపతి కపిలతీర్థంలోని ఆలయంలో దక్షిణామూర్తి విగ్రహం ఉంది. అనంతపురంజిల్లా హిందూపురం – కోటలో దక్షిణామూర్తి దేవాలయం ఉంది. జ్ఞానమూర్తులకు ఆలయాలకంటే – భక్తుల హృదయాలయాలే నివాసస్థానాలు. ఈ మూర్తి కుడిపాదం క్రింద మోహాసురుడు ఉంటాడు. అతణ్ణి కొందరు మూర్ఖాసురు డనీ అంటారు. వానిపై స్వామివారి కుడిపాదం ఉంటుంది. అంటే సంసారమోహాన్ని త్రొక్కి, నశింపజేసేవా డని అర్థం. సతీదేవీవియోగానంతరం – శివుడు దక్షిణామూర్తియై తపస్సు అంటే ఆత్మతత్త్వానుభూతిలో ఉన్నాడంటారు. దక్షిణా=దక్షిణం దిక్కుగా ఉన్న, అమూర్తి= భౌతికరూపంలేని ఆత్మస్వరూపుడు. దక్షిణామూర్తిమూలమంత్రంలో చివర "మహ్యం మేధాం ప్రజ్ఞాం ప్రయచ్ఛ స్వాహా" అని ఉంటుంది. ఆ స్వామినుండి కోరేది – బుద్ధిశక్తీ, ప్రజ్ఞాబలం అనేవి. "ఈశ్వరుడూ, గురువు, ఆత్మ" అయిన దక్షిణామూర్తికి నమస్కారమనే శ్లోకం ప్రసిద్ధమైంది. కనుక ఆదిగురువైన శివునిరూపమై, శుద్ధజ్ఞానమూర్తియై, సాన్నిధ్యమాత్రాన్నే శిష్యుల్ని జ్ఞానసంపన్నుల్ని చేయగల అద్భుతగురువు – దక్షిణామూర్తి. ఈ స్వామిని గూర్చినస్తోత్రాలు అనంతం. సురేశ్వరాచార్యులు మున్నగువారు ఆ స్తోత్రాలకు సంస్కృతంలో వ్యాఖ్యలు వ్రాశారు.

ఈ స్వామి ముఖ్యలక్షణం "స్వాత్మారామత్వం". అంటే తన ఆత్మను తాను దర్శించి, ఆనందించడం. ఈ విషయాన్నే కాళిదాస మహాకవి కుమార సంభవం – తృతీయసర్గలో "మనో నవద్వార నిషిద్ధ.....ఆత్మానమాత్మ న్యవలోకయంతమ్" అని పేర్కొన్నాడు. అక్కడ అందరి తపస్సులకూ ఫలాలిచ్చే ఈశ్వరుడు ఏ కోరికతో తపస్సు చేస్తున్నాడో! అని చెప్పి, ఆ స్వామితపస్సు స్వాత్మావలోకనఆనంద మని సమాధానం చెప్పాడు. ముల్లోకాలకూ ఈ స్వామి గురువు = జ్ఞానదాత. జననమరణాదిదుఃఖాల్ని పోగొట్టే జ్ఞానాన్ని ప్రసాదిస్తాడు.

**గురవే సర్వలోకానాం భిషజే భవరోగిణామ్ ।**
**నిధయే సర్వవిద్యానాం దక్షిణామూర్తయే నమః ॥**

– అని రోజూ ప్రార్థించి, నమస్కరించడంవల్ల అందరికీ బుద్ధిశక్తీ, ప్రజ్ఞాబలం, ఆయురారోగ్యాలూ, జ్ఞాపకశక్తీ, మనశ్శాంతీ చేకూర్తాయి.

ఇలా శ్రీ హయగ్రీవస్వామి, శ్రీ దక్షిణామూర్తి స్వామి – ఉభయులూ త్రిలోకగురువులై – భక్తుల్ని జ్ఞానవిజ్ఞానవంతుల్నిగా చేస్తున్నారు. శ్రీగురుపూర్ణిమసందర్భంగా ఆదిగురువులను ఇద్దర్నీ స్మరించడం ఉభయ తారకం!



# మొదటిబడి

- డా॥ రేవూరు అనంతపద్మనాభరావు, 98665 86805





**మాతృహృదయావిష్కరణ చేసే ఎన్నో కథలు, గాథలు, పురాణాలు మనకు కనిపిస్తాయి. మాతృదేవో భవ, పితృదేవో భవ, ఆచార్యదేవో భవ - అని ఆ ముగ్గురిలో ముందు వరసలో పీట వేశారు - మాతృదేవతకు. ఆమె సాక్షాత్తు దేవత. ఆ దేవతాంశతో పుట్టిన వ్యక్తికి ఆదిగురువు అమ్మయే!**

'తల్లీ! నిన్ను దలంచి పుస్తకము చేతం బూనితిన్' అనినా, 'అమ్మల గన్నయమ్మ, ముగురమ్మలమూలపుటమ్మ చాలపెద్దమ్మ' అనినా మాతృమూర్తుల ఘనతను శ్లాఘించడమే! జన్మనిచ్చిన కన్నతల్లి ఋణం తీర్చుకోలేనిది. నవ మాసాలు మోసి, ప్రసవవేదన అనుభవించి, బిడ్డ నేలపైబడ గానే హర్షామోదాలతో కనులు చెమర్చేది-తల్లి.

మాతృస్తన్యాన్ని గ్రోలి, పెరిగిన ఎందరో మహనీయులు జగజ్జేతలై నిలిచి ప్రసిద్ధి గడించారు. త్రిమూర్తులను పసిపాపల్ని చేసి, వడ్డించిన అనసూయామాత పురాణ ప్రసిద్ధురాలు. భాష ఎరుగని వేళలో సైగలతో పసిపాపకు లోకంలోని వస్తుజాలాన్ని, జంతుజాలాన్ని, వ్యక్తులను పరిచయం చేసేది- తల్లి.

బుడిబుడినడకలతో తప్పటడుగులు వేస్తున్న వేళలో ఉప్పొంగిపోయే హృదయంతో చిన్నారికి చేయూతనిచ్చే తల్లి జన్మజన్మలబంధాన్ని పెంచిపోషిస్తుంది. జిలిబిలిపలుకుల కారంభం - 'అమ్మా!' అనే పదమే! దేవత్వాన్ని, ఋషిత్వాన్ని, మానవత్వాన్ని ప్రోదిచేసి, బిడ్డను ఒక సంపూర్ణవ్యక్తిగా తీర్చి దిద్దుతుంది - అమ్మ.

మహాభాగవతంలో ప్రహ్లాదుడు మాతృగర్భంలోనే నారదప్రవచనాలు విన్నాడు. విద్యాభ్యాససమయంలోను, తండ్రిప్రశ్నలకు సమాధానాలిచ్చే సమయంలోను ప్రహ్లాదుడు వివేకాన్ని ప్రదర్శించాడు. తల్లి లీలావతి ఆయనకు ఆదర్శ మూర్తి. జన్మతః సిద్ధించిన వైష్ణవభక్తి ఆ బాలకునిలో జ్ఞాన బీజాలు నాటింది. 'కంజాక్షు నర్చించు కరములు, కరములు' అంటూ - 'తండ్రి! హరి జేరుమనియెడి తండ్రి తండ్రి!' అని సోపపత్తికంగా మాట్లాడాడు. మాతృగర్భంలో పడిన భక్తిబీజాలు ఆయనకు మార్గదర్శకాలైనాయి.

చారిత్రకంగా చూచినపుడు మరాఠావీరుడు శివాజీకి తన తల్లి జిజియాబాయి చిన్నతనంలో నూరిపోసిన ధైర్యసాహసాలు ఆయనను ఛత్రపతిని చేశాయి. మహారాష్ట్రలో జన్మించిన జిజియాబాయికి శహాజీరాజేభోంస్లేతో చిన్నతనంలోనే వివాహమైంది. 8 మంది పిల్లలలో శంభాజీ, శివాజీమాత్రమే మిగిలారు. చిన్నవయస్సులో ఉన్న శివాజీతో



తల్లి జిజియా రాజకీయకారణాలవల్ల బెంగుళూరు వదలి, పూనా వచ్చేసింది. ఆమె క్రాంతదర్శి. పుణ్యాత్మురాలు. ఒక స్వతంత్రసామ్రాజ్య నిర్మాణానికి తగిన పునాదులను శివాజీకి రామాయణ, భారతగాథల ద్వారా నేర్పింది. అందుకే అంటారు - ఉగ్గుపాలతో నేర్పిన శౌర్యవిద్య - అని. తల్లి ఉద్బోధలతో ప్రేరేపితుడై శివాజీ 1645లో స్వరాజ్యస్థాపనకు 17 ఏళ్ల వయస్సులో శపథం చేశాడు. కర్ణాటకలో జరిగిన యుద్ధంలో అఫ్జల్‌ఖాన్ చేతిలో పెద్దకుమారుడు శంభాజీ మరణించాడు. భర్త శహజీ మరణించినపుడు తల్లి సతీసహగమనానికి సంకల్పించింది. శివాజీ అభ్యర్థనతో ఆమె ఆప్రయత్నం విరమించుకొంది. తల్లిఆదర్శాలకు నిదర్శనంగా శివాజీ మరాఠారాజ్య పాలకుడయ్యాడు. కొద్దిరోజులకే తల్లి మరణించింది. ఈ విధంగా ఎందరో చారిత్రకమాతృమూర్తులు తనయులకు ఆదిగురువులయ్యారు.

**ఒకవ్యక్తి పరిపూర్ణవ్యక్తిగా సమాజంలో నిలబడటానికి తల్లిచేయూత ముఖ్యం. చదువుసంధ్యలలో గణనీయప్రతిభను ప్రదర్శించినా, మేధాశక్తితో సంపూర్ణవిజ్ఞానాన్ని పొందినా - అమ్మ చిటికెనవేలు పట్టుకొని నడిచిన మధురస్మృతులు చిరకాలం నిలిచిపోతాయి.**

శంకరభగవత్పాదులవారు తమ సౌందర్యలహరిలో మాతృస్తన్యమహిమను కొని యాడుతూ ఇలా వర్ణించారు- *"తల్లీ! పార్వతీ! నీ స్తన్యం నుండి వెలువడే పాలవెల్లి. నిజంగా సారస్వత ప్రవాహమని భావిస్తాను. కాకపోతే- దయతో నీవిచ్చిన చనుబాలు త్రాగి, ఈ ద్రవిడశిశువు (శంకరులు) మహాకవీశ్వరుడుగా ఎట్లయ్యాడమ్మా?"* ఆ విధంగా చనుబాలతో కవితాఝరినే గాదు- సమస్తలోకజ్ఞానాన్నీ కలిగించేది తల్లి.

పాఠశాలస్థాయిలో విద్యాబుద్ధులను సక్రమరీతిలో నేర్చుకొనేందుకు దోహదపడి, భవిష్యత్తుకు ఆమెబాటలు వేస్తుంది. జోలపాటలలో శౌర్యప్రతాపవిజ్ఞానసంపదలను అందిస్తుంది. 'జో అచ్యుతానంద! జోజోముకుందా! రావె పరమానంద రామగోవింద' అని జోలపాటపాడినా, రామా లాలీ! మేఘశ్యామలాలీ, తామరసనయన దరశథతనయలాలీ' అని లాలిపాట పాడినా ఉన్నతాదర్శమూర్తులను తీర్చిదిద్దడమనే గురుసంకల్పబలమే మూలం.

పురాణగాథలలో ధ్రువచరిత్ర చాలగొప్పది. ఉత్తానపాదునికి ఇద్దరుభార్యలు - సురుచి, సునీతి. సునీతికొడుకు ధ్రువుడు. తండ్రి అంకపీఠాన్ని ఎక్కబోయి, తిరస్కరింపబడి, బాధాముఖంతో తల్లివద్దకు వచ్చాడు. తల్లిబోధనతో విష్ణుని గూర్చి తపస్సు చేసి, మహోన్నతమైన ధ్రువస్థానాన్ని పొందగలిగాడు. భగవంతుణ్ణి ఆరాధించడంలోని ఔన్నత్యాన్ని ధ్రువునికి బోధించింది-సునీతి.

మహాభారతంలో వినతాతనయులు అనూరుడు, గరుడుడు. వినతాదాస్యవిముక్తికి గరుడుడు తోడ్పడి విష్ణుమూర్తివాహనమై నిలిచాడు. ఆనందనిలయంలో ప్రవేశించగానే మనకు కన్పించేమూర్తి గరుడాళ్వారు. ఆ తల్లి మరో కుమారుడు అనూరుడు కర్మసాక్షియైన సూర్యునిరథసారథి అయ్యాడు. ఆ విధంగా ఆ తల్లి చరితార్థురాలైంది.

భారతంలో విశిష్టమాతృమూర్తి కుంతి. తండ్రిలేని బిడ్డలను పోషించి, వారిరాజ్యభాగం వారు తిరిగి పొందేలా వారికి హితబోధ చేసింది. పాండవులకు అరణ్యవాస సమయంలోనూ దిగ్దర్శనంగా నిలిచింది. ఆమె ఏకచక్రపురంలో బకాసురునికి ఆహారంగా భీముణ్ణి పంపిన ధీమంతురాలు. మాతృహృదయం ఎరిగిన సాధ్వి- ఆమె. సపత్ని మాద్రికుమారులైన నకులసహదేవులను తన బిడ్డలతో సమానంగా చూచిన మాతృమూర్తి. పాండవులు రాజ్యాధికారాన్ని స్వీకరించిననాడు ఆమె వారిప్రాపున నిలువలేదు. గాంధారీధృతరాష్ట్రులతో ఆశ్రమవాసానికి వెళ్లింది.

ఈ విధంగా పౌరాణికగాథలలోను, చారిత్రకగాథలలోను మాతృమూర్తులు శిశువులకు ఆదిగురువులుగా నిలిచి, లోకైకపూజ్యులైనారు. అందుకే జగదేకమాతలుగా పూజార్హులై నిలిచారు. మాతృవందనానికి అర్హులయ్యారు. మాతృదేవో భవ!



హైమసరోజాంగ!
అలమేలుమంగ!
జీమూతసంకాశ!
శ్రీవేంకటేశ!
వనమాలి!
అవధారు వరదానశీలి!

కాంచీపురానికి తూర్పున సాగర సీమకు పడమట ఒకవిశాలభూభాగ ముంది. ఆ భూభాగం సకలసంపద్విరాజితం. బ్రహ్మదేవుడంతటివాడే ఈ భూభాగానికి సాటి రాదగ్గ ప్రదేశంలేదని, త్రాసులో తూచి తేల్చేసిన సత్యం. ఆ సృష్టికర్త నామకరణం చేసిన ప్రదేశమే మహీసారపురం. ఆ పురంలో ఒక వైష్ణవాలయం.

ఆ నగరానికి ఆనుకొని ఒక నందనోద్యానవనముంది. ఆ వనం సామాన్యమయింది కాదు. చైత్రరథాన్ని తలదన్నేది. అక్కడ లెక్కలేనన్ని రకరకాల వృక్షాలు. పనసచెట్లు, పారిజాతాలు, పూగవృక్షాలు, సరసరసాలాలు సింధువారాలు ఎన్నో! అంతేకాదు రకరకాల పూలజాతులు. మల్లెలు, బొండుమల్లెలు, విరజాజులు – ఆలాగే ఫలవృక్షాలు సారసభవునిలాగా, శంభునిలాగ, సురనాయకునిలాగ, సుగ్రీవునిలాగ, నాగలోకంలాగా, నలినాస్త్రునిలాగా, వనరాశిలాగ, దిగ్వలయంలాగా కనిపించే ఆ ప్రదేశాన్ని చూచి, భార్గవుడు తన తపస్సుకు అదే తగినప్రదేశంగా భావించాడు.

భార్గవునితపస్సుతో ఆ ప్రదేశం 'పవిత్రాణాం పవిత్ర' మయింది. జంతువులమధ్య కాసంత వైరంకూడా కనిపించలేదు. అక్కడ పుట్టలోని చిరుపాములను పట్టుకొని, నెమళ్ళు జోలపాడుతున్నాయి. దరిదాపుల్లో తిరిగే జింకపిల్లలను రారమ్మని పిలిచి, బెబ్బులులు ఉగ్గుపెడుతున్నాయి. ఎలుకపిల్లలను చేరదీసి, పిల్లులు పాలుగుడుపుతున్నాయి. అటువంటిప్రదేశంలో భార్గవుడు ఘోరతపశ్చర్యకు సన్నద్ధుడయ్యాడు.

నేలపై 'పోక' పెట్టాడు. ఆ పోకపై పదనుసూది గుచ్చాడు. ఆ సూదిమొనపై పాదం మోపాడు. సూర్యునివైపు మొగం త్రిప్పి, దేవతాపూర్వకమయిన మంత్రం జపించి, సాధన మొదలెట్టాడు. హేమంతకాలంలో మడువులలో నిలిచాడు. వేసవి వేళల 'పంచాగ్నుల' మధ్య ఏకాగ్రచిత్తంతో ఘోరతపం చేయసాగాడు. అపుడు ఆ తపోధనుని శరీరంనుండి 'విలయకాలాభీలాగ్ని' జ్వాలలు రేగాయి. ఆ తపోజ్వాలలు ఆకాశానికెగిశాయి. ఇంద్రలోకందాకా ప్రాకాయి. స్వర్గవాసులు హాహాకారం చేశారు. దేవేంద్రుడు గాబరాపడ్డాడు. ఇంతవరకు తనకు సమానులు లేరనుకొంటే – ఇపుడు 'అసమానభీతి' మొద లయింది. తనకు చుక్కెదురు! ఇంతటి ఘోరతపం చేసేవాడెవడో, తన పదవికి ఎసరుపెట్టేవాడెవడో, దీనిపరిణామం ఎలా ఉంటుందో అని భయపడ్డాడు. ఉపాయం ఆలోచించాడు. వెన్వెంటనే 'కాంచనవర్ణి' అనే అప్సరసస్త్రీని రప్పించాడు. ఆమెను సంభావించాడు. తెగ పొగిడాడు.

'కాంచనవర్ణి! శ్రద్ధగా విను. భూలోకంలో భార్గవుడనేవాడు ఘోరతపస్సు చేస్తున్నాడు. నీవు ఆ భార్గవుని ఆశ్రమానికి వెళ్ళు. నీ ఆటపాటలతో ఆంగికాభినయంతో వలపు కుమ్మరించేమాటలతో భార్గవుని తపస్సును భంగం చెయ్యి. నాకు తెలుసు.



నీవెంతో చతుర వని, నీ అందచందాలు ఎవరినైనా కవ్వి స్తాయని. నిన్ను చూచినవాడు నీ పొందే కోరుకొంటాడు. దేవసామ్రాజ్యాన్ని తృణప్రాయంగా భావిస్తాడు. అంచేత ఇపుడే వెళ్ళు' అని ఆదేశించాడు.

ఆ 'లేమ' కదిలింది. మహీసారపురం చేరుకొంది. తపోవనం పరిశీలించింది. దేవేంద్రవనంకన్నా గొప్పగా వనం ఉండడం చూచి, పరవశించింది. ఇంక తానెలా మసలుకోవాలో మనసులో పథకం వేసుకొంది. ముందుగా చెలికత్తెలు మెచ్చేలా సింగారించుకొంది. చిన్నారినామం తీర్చింది. పచ్చలపతకం చేర్చింది. అందంగా కొప్పు అమర్చింది. కస్తూరి పూసుకుంది. కుచ్చెలచీరకట్టింది. ఆపైన మొలనూలు సరిచేసుకొంది. అవయవాలకు తగిన ఆభరణాలను అలంకరించుకొంది. 'మన్మ థుని మోహనకాండలా' ముస్తాబయింది. వలపులు విసురుతూ ఒయ్యారంగా ఒక మావిచెట్టుకింద నిలిచింది. మురిపించే సొగసుతో, ముద్దులు మూటగట్టే మోముతో, ముందుకు నడి చింది. భార్గవముని తన కేసి వస్తున్న తారుణ్యవతిని చూశాడు. ఇంకేం! భార్గవముని అంతరంగం సడలింది. ఏకాగ్రతాదృష్టితో రవిని చూస్తూ తపస్సుచేసేకళ్ళు చంద్రవదనతాటంకాలపై వాలాయి. విధియుక్తమంత్రం జపించే నాలుక చిన్నారి పేరడిగి పలకరించాలనిపించింది. హృదయాబ్జంపై నిలిపినబుద్ధి మది రాక్షిపాదపద్మాలను చూడాలని తపించింది. ఇంకేం? ఆపుకోలే నంత కామేచ్ఛ ప్రబలింది. అచ్చరదగ్గరికి తానే వెళ్ళాడు.



'కమలాయతాక్షి! జగన్మోహనాంగి! నీ వెవరు? నీ పేరేమి? నీవు దేవకన్యవా? నాగకన్యవా? భూకన్యవా? నీ జాడ చెప్పు మరి'– అని ప్రశ్నలు కురిపిస్తుంటే 'కాంచనవర్ణి' మునిని చూచి 'చిక్కాడులే ఎక్కడికి పోతా'డని మనసులో అనుకొని బెట్టుగా మాటలు కలిపింది.

'ఓ అనఘాత్మ! నేను అమరకన్యను. నా పేరు కన కాంగి. పావనఆశ్రమాలు దర్శించాలనే కోరికతో చెలికత్తెలతో వచ్చాను. మీలాంటివారికి సేవచేయాలనే నా తపన. అయినా మౌనివర్యా! ఇదేం తగని పని? ఒంటరి అందగత్తెలతో మాటలా డడం తగునా? తలిరుబోడులకు, తపశ్శీల సంపన్నులకు చుక్కె దురు కదా! అయినా ఒక విషయం చెబుతాను. ఆడవారి అసలుసంగతి మీకు తెలిసినట్లు లేదు.

'మనసొకటి, మాటొకటి! నియమపాలన అంతంతే. వావివరుసలు అసలు లేవు. తమకంటూ నైజవర్తనమంటూ ఏదీ లేదు. ఈన గాచి, కుక్కల పాలుచేసినట్లు – మీ తపోధనమంతా గంగపాలు చేయడం న్యాయమా? పరమ 'తపోరాజ్యపట్ట భద్రు'లైన మీరు ఒక పడతికోసం వెంపరలాడడం న్యాయంకాదు. వద్దు వద్దు. చేతులెత్తి నమస్క రిస్తున్నాను' అని నంగ నాచిలా మాటలా డింది. పోయి వస్తానంటూ సొగసుగా తిరి గింది. భార్గవుడు గతుక్కుమన్నాడు. ఎక్కడ వెళ్ళిపోతుందో అని కలవరపడ్డాను.

'కనకాంగి! కలకాలం కానలలో ఆకులలములు తిని అలసి పోవడమెందుకు? నీలాంటిభామల పొందు సామన్యమా? ఆ పొందు

అనుభవించనివానిజన్మం ఒక జన్మమేనా? అయినా ఒకటి చెబుతాను విను. పరమేశ్వరుడే పార్వతికి సగం దేహమిచ్చాడు. బ్రహ్మదేవుడు సరస్వతిని తనదాన్నిగా చేసుకొన్నాడు. వెన్నుడు లచ్చిని ఏలుకొని వక్షఃస్థలంలో దాచాడు. ఈ సౌఖ్యాలన్నీ ఇచ్చే వారు అందగత్తెలు కదా? విపరీతార్థం తీస్తావెందుకు? నన్ను విడిచిపోవడం తగదు. తపం పండాక జడలెందుకు? నీ పొందు ఖాయమయినప్పుడు తపమెందుకు? జపమెందుకు?' అని ముని కాళ్ళబేరానికి రావడం గుర్తించి, ఇంక బెట్టుచేయడం మంచిది కాదని మునితో 'సరే' నంది. భార్గవుడు పరవశుడయ్యాడు. విశ్వామిత్రుడు మేనకతో గడిపినట్లు కాలం గడుస్తూవుంది.

కాలం గడిచేసరికి భార్గవునికి పరితాపం మొదలయింది.

'నేనెంత పాపిని! తగును తగదని నిష్కర్ష చేసుకోలేక పోయాను. ఈ పవిత్రపావనప్రాంతంలో అకృత్యం చేశాను. ఎక్కడి సురలోకం? ఎక్కడి తపం? ఇక్కడికి అచ్చర రానేల? వచ్చినా నా చూపు పడనేల? మరులు గొననేల? మచ్చువేసినట్లు నేను వశం తప్పనేల? కడలిలోని ఉప్పు నేలమీది ఉసరికాయ కూడినట్లు నాకీ పొందు కలగడానికి కారణమేమిటి? మంటల దగ్గర వెన్న కరగకవుంటుందా? ముదితలమధ్య మౌనులస్థైర్యం సడలదా? అయినా ఇదంతా 'దైవకృతం' అని నిట్టూర్చాడు.

అయిందేదో అయిపోయింది. హఠయోగం హఠాత్తుగా పటాపంచలయింది.

'అనంతమయిన తపస్సు అతివకారణంగా ఆభాసుపాల యింది. నా పాపానికి నిష్కృతి లేదు. మహీసారపురవాసం నాకు తగదు. మాధవసంస్మరణే నిష్కృతి. తీర్థయాత్రలుచేసి, దివ్యదేశాలలోని అర్చామూర్తులను దర్శిస్తూ – కాలం గడుపుతా' నని కదలి వెళ్ళిపోయాడు.

భార్గవుడు తనదారి తాను ఎన్నుకొంటే కనకాంగి ఆలో చించింది. అమరాధిపతి ఆన నెరవేర్చాను. అమరావతికి తిరిగి వెళ్ళడమే మంచిదనుకొంది. ఒక్కసారి ఆలోచనలో పడ్డది. తాను ఇపుడు గర్భవతి. భూతలస్పర్శతో భూలోకవాసుల సంగమానికి ఫలితమేమిటో తెలిసింది. తాను ఈ స్థితిలో స్వర్గం వెళ్ళడం తగదనుకొంది. పండంటికుమారుడు పుట్టాడు.

సద్యోగర్భంలో ఆ వేళ 'మఖతార' – పౌష్యమాసం. సుదర్శనచక్రంలా మెరసిపోతున్నాడు – శిశువు. అయినా ఈ బంధం తెంచుకోవాలనికొంది – కనకాంగి. పుట్టినవాడు సామా న్యుడు కాదు. పరమపూజ్యుడవుతాడని మనసు చెబుతూనే ఉంది.

ఒక్క క్షణం ఆగింది.

వెదురుగుంపులమధ్య బిడ్డను వదలి, వినువీథికి ఎగిరి వెళ్ళిపోయింది.

పాపం! పసిబిడ్డ.

ముక్కుపచ్చలారనిబిడ్డ. నిర్మానుష్యమయిన అడవిలో సామవేదనాదంతో గొంతెత్తి ఏడవడం మొదలెట్టాడు. ఆ బిడ్డ ఏడుపును మానవమాత్రులెవరూ వినలేదు. మాధవుడు విన్నాడు. మహీసారపురంలోని స్వామి విన్నాడు. తానే ప్రత్యక్షమయ్యాడు. తన కరుణాకటాక్ష అమృతధారలతో ఆ బాలుని ఏడుపు మాన్పిం చాడు. అంతర్ధానమయ్యాడు. సరిగ్గా అదేవేళ వేణులావకుడనే హరిదాసు ఆ వెదురుగుంపు దగ్గరికి వచ్చాడు.

వెదురుగుంపుమధ్య వినూతనతేజంతో ప్రకాశించే బిడ్డను చూచాడు. ముందు వేణులావకుడు జడుసుకొన్నాడు. వెదురు జొంపంలోని ప్రాణి 'పిల్లేమో' అనుకొన్నాడు. కాదు 'జాబిల్లి' అనుకొన్నాడు. మరో వింతప్రాణి ఏమో అని భ్రమించాడు. కాసేపటికి పసివాడని తెల్చుకొని, 'పెన్నిధిగన్న పేదలాగ' సంతానం లేని తనకు దైవం ప్రసాదించిన బిడ్డగా భావించు కొని, ఎత్తుకొని తన పట్టణానికి వెళ్ళి, తన భార్య కిచ్చాడు. ఆ తల్లి పద్మనాభుణ్ణి చూచిన యశోదలాగా సంతోషించింది. పిల్లవానికి 'చనుబాలు' ఇవ్వాలని దగ్గరికి చేర్చుకొంది. కానీ పసివాని ముందర ఇందిరానాథుడే నిలిచాడు. ఆ దివ్య మంగళ విగ్రహాకారుణ్ణి చూచి, పసిపాపడు పాలుద్రావడం మరచాడు. పసిపాపడు పాలు తాగకపోవడం ఆ తల్లికి వింతనిపించింది. అదే సమయంలో పిల్లవాడెలా బతుకుతాడని బెంగతో తన మగనితో...,

'అయ్యా! ఎలాంటి పిల్లవాణ్ణి తెచ్చావయ్యా! పాలు తాగడం లేదే? నోట చనుల పెట్టనీవడం లేదే? ఉగ్గుకూడా మింగడం లేదే? ఏడవడేమిటి? ఆకలున్నట్టు అసలు తెలియడం లేదే? ఏ దిక్కుచూడకుండా కిమ్మనకున్నాడే? వీడు ఉలుకూ పలుకూ లేదే. వీడు దయ్యమా? లోకంలో ఈలాంటివాణ్ణి చూడ

లేదే' అని ఏడుపులంకించుకొంది. ఈ వార్త ఆనోట ఈ నోట ప్రాకింది.

ఆబాలగోపాలం వేణులావకుని ఇంటికి రావడం మొదలెట్టారు. ఆ నగరంలోనే ఒక వృద్ధదంపతులు, సంతానం లేనివారు– చాలకాలం తమకు సంతానం లేకపోవడంతో ఆ దంపతులు క్రుంగిపోయారు. వేణులావకునిఇంటి వార్తలు విన్నారు.

'పుట్టినవాడు బహుశః దేవుడే అయ్యుండవచ్చు. ఆ దేవతామూర్తిని చూడాలి అనుకొన్నారు. దేవునిదగ్గరికి వెళ్ళేవేళ వట్టిచేతుల్తో వెళ్లరాదు'. అంటూ ఒక సోలనేయి, ఒక చేరెడు పాలతో వేణులావకుని ఇంటికి వెళ్ళాడు. అక్కడ వటపత్రంపై పడుకొన్న బాలముకుందునిలాంటివాణ్ణి చూచారు. తొట్టెలలో పడుకొని యోగనిద్రను నటించే యోగిలాగా దర్శించారు. వెంటనే ఆ యోగిముందర తాము తెచ్చిన పాలుపెట్టారు.

'యోగీంద్రవర్యా! దేవేంద్రసన్నుత! కుచేలునిఅటుకులను కృష్ణుడు ఆదరంతో స్వీకరించినట్లుగా – ఈ పాలు స్వీకరించవయ్యా! ఇదే మా భక్తికానుక. కరుణించ' మని దీనాతిదీనంగా ప్రార్థించాడు. ఏమి వింత?

శిశువు పద్మాసనుడై పాలారగించాడు.

ఊరివారిసేవలు లెక్కచేయని మౌని తన సేవకు అమోదముద్ర తెలపడం ఆ వృద్ధునికి ఆశ్చర్యం వేసింది. అంతేగాదు రోజూ పాలు తెచ్చేవాడు. యోగి ఆరగించేవాడు. ఒకరోజు యథాప్రకారం పాలు అర్పిస్తే – మౌని సగం పాలే తాగాడు. మిగిలిన సగం దంపతులను తాగమన్నాడు. ఆ వృద్ధదంపతులు ఆలాగే మిగిలిన పాలు స్వీకరించారు. ఏమాశ్చర్యం!

వారిలో వృద్ధలక్షణాలు మటుమాయమయ్యాయి. వారు తరుణవయస్కులయ్యారు. పరమానురాగసంభరితులయ్యారు. చివరకు మౌనిఆనతో ఇంటికి మరలారు.

కొన్నాళ్ళు గడిచేసరికి మునినాయకునివరంతో ఆ దంపతులకు 'కణికృష్ణుడనే' కొడుకు పుట్టాడు. ఆ కుమారుణ్ణి అల్లారుముద్దుగా పెంచుకున్నారు.

మేదరిబాలుడు క్రమంగా పెరిగి పెద్దవాడయ్యాడు. తానే పరతత్త్వమయినా – గోపాలునిలాగ నందునియింట నడయాడినట్లు – యోగి నడయాడసాగాడు.

నివురు గప్పిన నిప్పులాగా మెలగసాగాడు. అనుపమ యోగీంద్రుడయినా అపరిమితతేజస్వి అయినా సామాన్యునిలాగా మేదరికుమారునిలాగా వెదురుతో అల్లిన చేటలను విక్రయిస్తూ కాలం గడపసాగాడు.

వృత్తి ఒకటయినా ఆ మౌనిప్రవృత్తి భిన్నం. అతనికెపుడూ 'కమలేశపాదపంకజయుగధ్యానమే' మబ్బులు కమ్మిన ఆకాశంలో సూర్యునిలాగా యోగి కనిపించేవాడు. అయినా ఆ యోగికి 'యోగానురక్తి' పెరిగింది. చిన్నగుడిసెలో ఒకమూల కూర్చొని భగవంతుణ్ణి గురువుగా భావించి, యోగవిద్య సాధించడానికి సిద్ధమయ్యాడు.

పద్మాసనం వేసుకొన్నాడు. షట్కర్మలు ఆచరించాడు. దశమహాముద్రలను సాధించాడు. పదునాల్గునాడులను వివేకించాడు. అష్టవిధకుంభకాలను ఏర్పరచుకొన్నాడు. షట్చక్రాలను మేలుకొలిపాడు. బాహ్యవిషయాలపై అనురక్తి వదలుకొన్నాడు. హరిభక్తి సారామృతమే ధ్యేయంగా జీవనం గడపసాగాడు.

యోగి సాధించిన యోగవిద్యకు యోగీశ్వరుడు సంతోషించాడు. విశ్వరూపంతో యోగిని సంతృప్తిపరచాడు. సనకాది మునీంద్రులకుకూడా సాధ్యంకాని దివ్యరూపాన్ని సందర్శించి, ఒడలు మరచి యోగిభక్తితో గానం చేయసాగాడు.

భక్తితో భగవంతుణ్ణి ప్రత్యక్షం చేసుకొన్నవాడు కావడం వల్ల ఆనాటినుండి ఆ యోగికి భక్తిసారుడనే పేరు సార్థకమయింది.

కాలం గడుస్తూవుంది.

మహీసారపురవాసం మాన్యమయినా మాధవనిలయమయినా భక్తిసారునికి సంతృప్తి కలిగించలేదు. తనది భక్తిమార్గం. యోగమార్గం. ఈ రెండుమార్గాలలో యోగమార్గానికి మహీసారపురం తగనిదనిపించింది భక్తిసారునికి. పదిమంది నడయాడేచోట యోగనిష్ఠ కుదరదని మనస్సు హెచ్చరిస్తూ ఉంది.

అందుకే భక్తిసారుడు మహీసారపురం వదలిపెట్టాడు. నగరానికి సుదూరంలోని అడవివైపు నడిచాడు. యోగసాధనలో మెట్టుకు పైమెట్టుక్కుతూ కాలం గడపసాగాడు.

*(ఇంకా ఉంది)*




# తరువులు - గురువులు

- శ్రీ సముద్రాల శఠకోపాచార్య, 99593 24703

**"పరోపకారార్థ మిదం శరీరం" అనే సూక్తిని అక్షరసత్యం గావిస్తూ, తమను ఆశ్రయించినవారికి తమ జీవితాన్ని సంపూర్ణంగా అంకితం చేసేవాళ్ళే గురువులు - తరువులు.**

ప్రతివ్యక్తికి జన్మనిచ్చేది వారితల్లిదండ్రులే అయినా ప్రతివ్యక్తిని ఒకశక్తిగా మార్చేది గురువులే. ప్రతివ్యక్తికి కావలసిన వాటినన్నింటినీ నేర్పుతూ, వానిలో ఉండే జ్ఞానాం కురాన్ని ఒక మహావృక్షంగా గురువు తీర్చిదిద్దుతాడు. గురువు సామాన్యుడిలోకూడా విజ్ఞానబీజాలు నాటి, అతణ్ణి మహనీయుడిగా గణతికెక్కేట్లు తయారు చేస్తాడు.

తరువులుకూడా తమను ఆశ్రయించినవారికి నిలువ నీడనిచ్చి తియ్యని పండ్లనిచ్చి సత్కరిస్తాయి. ఒకటేమిటి? తమ తనువునూ అర్పిస్తాయి. గురువులందించే విజ్ఞానాన్ని పొందకపోతే ప్రగతి ఉండదు. అట్లే వృక్షాలు అందించే ప్రాణవాయువు లేకపోతే మనిషికి మనుగడే లేదు. అందుకే జ్ఞానప్రదాతయైన గురువుకు సమాజంలో, నిరంతరం పరోపకారానికి పాల్పడేవృక్షాలకు సృష్టిలో ప్రత్యేకస్థానం ఉంది.

పరోపకారాన్ని మించినపుణ్యం లేదు. పరాపకారాన్ని మించినపాపం లేదు. ఎల్లప్పుడూ పరోపకారం చేస్తూ ఉండేవాళ్లే ధన్యజీవులు. వారిజీవితమే సఫలం!

గురువు నేర్పే విద్యలు అభ్యసించినవాడు ఈ లోకంలో కీర్తి, ప్రతిష్ఠ, జీవనాధారం సమకూర్చుకుంటాడు. అంతేకాకుండా గురూపదేశాన్ని క్రమంతప్పక పాటిస్తూ ముక్తినీ పొందగలడు.

తల్లిదండ్రులు తమ పిల్లల్లో దాగి ఉన్న ప్రతిభను గుర్తించలేరు. పిల్లల శక్తియుక్తులు తెలిసేది గురువులకే. అందుచేతనే పూర్వకాలంలో పిల్లల్ని గురుకులానికి పంపి, గురువుసన్నిధిలోనే ఉంచేవాళ్లు. తమ పిల్లవాడు ఎంతో శక్తికలవాడైనా, ఆ తల్లిదండ్రులకు అతడు బాలుడుగానే కన్పిస్తాడు.

దశరథుడుకూడా రామలక్ష్మణుల్ని పసితనం వీడని పిల్లవాళ్ళనుగానే భావించాడు. కానీ విశ్వామిత్రుడు వాళ్లిద్దరిలోని శక్తిని గ్రహించి, వాళ్లను తనవెంట తీసుకొని వెళ్లి, వాళ్లద్వారా యాగరక్షణం జరిపించాడు. వాళ్లకు అనేక విద్యలను నేర్పాడు. చివరికి రామలక్ష్మణుల వివాహంకూడా జరిపించాడు.



వృక్షాలు ఆకుల, పూల, పండ్ల బరువును మోస్తాయి. వేసవిలో ఎండతాకిడిని, శీతాకాలంలో చలిబాధను తట్టుకుంటాయి. తాను ఇన్ని పాట్లు పడుతున్నా ఇతరులసుఖానికై ఎలాంటి సంకోచం లేకుండా తృప్తిగా, ఆనందంగా తమ తనువుల్ని అర్పిస్తాయి. అట్టి పరమపూజ్యమైన, గురు

## గురువు

సీ॥ జాతికి కడుగొప్ప ఖ్యాతి నందించెడు
వ్యక్తులఁ దీర్చెడుశక్తి గురువు,
మట్టిమనుషులందు దిట్టతనంబును
స్థాపించగల్గినశక్తి గురువు,
బరువుగా మారిన బ్రతుకుల యందున
సంతోషమును నింపుశక్తి గురువు,
ఉరిత్రాడు నవ్వేడు తరుణంబునందున
స్థైర్యంబు నిచ్చెడిశక్తి గురువు,

తే.గీ॥ నల్లజాతికి అందాలనవ్వు పులిమి,
ఎద యెడారులలో జీవనదులు నింపి
మ్రోడు పూయించి 'పండించి' బీడులెల్ల
జవము సత్త్వము నింపెడిశక్తి గురువు

- శ్రీ ఆముదాల మురళి, 94404 32683

ప్రాయులైన తరువులకు నమస్కరించడంవల్ల మనం మన కృతజ్ఞతను ప్రకటించినవాళ్లమవుతాం.

వృక్షాలు ఎట్లా నిరంతరం ఇతరుల శ్రేయస్సును అభిలషిస్తాయో అట్లే ఆచార్యుడు ఎల్లవేళలా శిష్యుడి శ్రేయస్సునే కాంక్షిస్తాడు. విద్యారంభసమయంలో గురువు ప్రతినిత్యం "తనను తన శిష్యునితో కలిసి రక్షించమని, మా అధ్యాపనఅధ్యయనాలు, పఠనపాఠనాలు నిర్విఘ్నంగా కొనసాగాలనీ, మాలో ద్వేషభావాలు ఏర్పడవద్దనీ, మేమి ద్దరం తేజోవంతులం కావాలనీ – గురువు శిష్యుడితో కలిసి ప్రార్థిస్తాడు. దీని ద్వారా గురువుయొక్క త్యాగనిరతి, స్వార్థరాహిత్యం స్పష్టమవు తూంది.

శిష్యుల్ని సానపెట్టి, రత్నాలుగా తీర్చిదిద్దే గురువులు త్యాగానికి ప్రతీకలు. గురువుల్లాగా తరువులూ త్యాగానికి ప్రతీకలు.



తరువుల్లాగా గురువులుకూడా పరోపకారపరాయణులై,
తమచెంత చేరిన పిల్లలకు విద్యాబుద్ధుల్నీ
శాస్త్రాంశాల్నీ నేర్పుతూ, వాటిల్ని తాము ఆచరిస్తూ,
శిష్యులచే ఆచరింపచేస్తారు.
అందువల్లే గురువు ఆచార్యుడిగా పూజ్యుడయ్యాడు.

గురువులు అజ్ఞానమనే చీకటిని పోగొట్టి, విజ్ఞానమనే కాంతిని అందిస్తారు. తనవద్ద విద్యను అభ్యసించడానికి వచ్చిన వాళ్లు తనవారా లేక తనకు గిట్టనివాళ్ళా అని ఆలోచించని ఉదారచరితులైన గురువులు ఎందరో ఉన్నారు.

అట్లే వృక్షాలుకుడా తనవాళ్ళా పరాయివాళ్ళా అనే భేదం లేనివి. తమను ఆశ్రయించి తమసహాయాన్ని కోరే వాళ్లను ఆదుకునే ఈ వృక్షాలు, తమను నరికేవారికికూడా నిలువనీడనిస్తాయి. ఉపకరిస్తాయి. ఈ చెట్లు తమను చేరి, తమ మొదళ్ళను తొలిచే చీడ పురుగులకూ, విషంతో నిండిన బల్లులకూ, పాములకూ ఆశ్రయమిస్తాయి. తరువులు తాము దుర్గంధాన్ని పీలుస్తూ, మనకు పరిశుద్ధమైన గాలిని 'ఆక్సిజన్' రూపంలో అందిస్తాయి.

ఉదారబుద్ధిగల తరువులు తాము మురికినీటిని గ్రహిస్తూకూడా తియ్యటిపండ్లనే అందిస్తాయి. పర్యావరణ కాలుష్యాన్ని తొలిగిస్తూ విరివిగా వర్షాలు కురవడానికి సహకరిస్తాయి. ఇట్టి వృక్షాల్ని మనం రక్షిస్తేనే అవి మనకు ఉపకరిస్తాయి అని "వృక్షో రక్షతి రక్షితః" అనే సూక్తిద్వారా వెల్లడవుతూంది.

ఇలాంటి తరువులు, గురువులు నేడు నిరాదరణకు గురవుతున్నారు. "చెట్లే ప్రగతికి మెట్లు" అని చాటుతూ, చెట్లను పెంచాల్సింది పోయి, వాటిల్ని నరికేయడం సబబు కాదు. అట్లే నేటి విద్యార్థుల్ని రేపటిబాధ్యతగల పౌరులుగా తీర్చిదిద్ద గల గురువుల్ని ఆదరించాలి. గౌరవించాలి.

"గురువు గురువన్నమాత్రాన గురువు కాదు – గురువుపై నున్నభారంబు గురుతరంబు, గురువు లేనట్టి విద్యలు గ్రుడ్డివౌను. గురువు పూజ్యుండు సర్వత్ర గొప్పవాడు"

"తస్మై శ్రీగురవే నమః"



# కైంకర్యమే.. తనువు దాల్చితే....

3

- డా॥ కంపల్లె రవిచంద్రన్, 98487 20478



(జరిగిన కథ - యాదవప్రకాశుడు రామానుజుని విజ్ఞానానికి ఈర్ష్య చెంది, యాత్ర పేరుతో మార్గమధ్యంలో వారిని తుద ముట్టించాలనుకున్నాడు. గోవిందుడు ఇది పసిగట్టి, ఆ ప్రమాదం నుండి రామానుజులవారిని తప్పించాడు. వారు అరణ్యంలో నుండి స్వస్థలానికి ఎలా వెళ్లాలో తెలీక తికమక పడుతుంటే భిల్లదంపతుల జంట తారసపడింది. ఆ తర్వాత.... )

"బిడ్డా! నువ్వు యాడికి పోతండవ్?" అని అడిగారు.

"నేను కాంచీపురం వెళ్లాలి" అన్నారు-రామానుజులు.

"మేము రామేశ్వరయాత్రలో ఉన్నాం. అటే వెళ్తున్నాం. అందాకా తోడువస్తాం. రా నాయనా!"

ముగ్గురూ ముచ్చట్లతో ప్రయాణం సాగించారు. మాటల్లో ప్రయాణంబడలిక ఇసుమంతైనా తెలీలేదు.

కాంచీపురం సమీపానికి రాగానే ఆ భిల్లదంపతులు రామానుజునివద్ద సెలవు తీసుకున్నారు. రామానుజులు "పుణ్య దంపతులారా! నేనింతత్వరలో, ఇంత సురక్షితంగా ఇల్లు



చేరుతాననుకోలేదు. మీ సాయం కృతజ్ఞతకు అతీతమైంది. అయినా అది చెప్పుకోనంతవరకూ బరువు. కనుక ఇలా చెబుతున్నానని" పరిపరివిధాలా వారికి కృతజ్ఞతాంజలులు సమర్పించి, కంచిలో అడుగుపెట్టారు.

రామానుజులు కంచిలో వరదరాజస్వామి ఆలయానికి వెళ్లారు. అక్కడ వారికోసం కాంచీపూర్ణులు నిరీక్షిస్తున్నారు. వీరినే తిరుకంచినంబి, తిరుక్కచ్చినంబి అని కూడా పిలిచేవారు. వీరు శ్రీవరదరాజస్వామివారిని ఆశ్రయించి, ఆలయసేవాకైంకర్యాలు నిర్వర్తించేవారు. అతనికీ, రామానుజులవారికి ఎప్పటినుండో మైత్రి.

యాదవప్రకాశునిబారినుండీ శ్రీవరదరాజస్వామి - పేరిందేవితాయార్లకృపాకటాక్షంతో తప్పించుకుని వచ్చిన రామానుజులు కంచి చేరిన వెంటనే వరదరాజస్వామిని దర్శించారు. వారికి కన్నీరు కట్టలు తెగింది. బాధ అవధులు దాటింది. హృదయక్షోభకు అక్షరం చాలదు. ఆ సమయంలో తిరుక్కచ్చి నంబి రామానుజులవారిని ఊరడింపజేశారు. అప్పటినుంచి రామానుజులు తిరుక్కచ్చినంబిని ఆచార్యునిగా భావించారు.

రామానుజులు ఇల్లు చేరారు. కాంతిమతి, తన కొడుకు అంతత్వరగా ఇంటికి తిరిగిరావడం చూచి ఆశ్చర్యపడింది. రామానుజులు జరిగినవిషయాలన్నీ గోప్యంగానే ఉంచారు. అవి చెప్పుకుంటే అందరూ గురువుగారిని దోషిగా చూస్తారు. అప్పుడు శిష్యుడే గురువుగారికి ద్రోహం చేసినట్లవుతుంది. "గురువుగారు నాపై అసూయపడ్డం నా దౌర్భాగ్యం కనుక

ఆ చేదు సంఘటనలు నేనే దిగుమింగుకుంటాను" అని రామాను జులు వాస్తవం దాచారు.

వరదరాజస్వామిసేవ - తిరుక్కచ్చినంబి ఉపదేశం రామానుజులకు నిత్యకృత్యం అయింది. ఉపదేశం తెరలు తొలగిస్తున్నది. వెలుగులు వ్యక్తపరుస్తున్నది.

కాలం గడచిపోతోంది.

యాదవప్రకాశుడు యాత్రనుంచి తిరిగి వచ్చాడు. రామానుజుడు సజీవంగా వర్ధిల్లుతున్నారు. అది విన్నాడు. కన్నాడు. దెబ్బతిన్నాడు. నేరం చేసినట్లు బెదిరాడు. రామానుజులకు ముఖం చూపలేకున్నాడు.

గురువర్యులు వచ్చారని తెలిసి రామానుజులే వెళ్లారు. గురువుగారికి రామానుజులు మచ్చలేని పున్నమిచంద్రునిలా కనిపించారు. రావణుడు స్వయంగా వచ్చినా క్షమిస్తానన్న రాముని వలె కనిపించారు. ఇద్దరూ విద్యావిషయం తప్ప- తక్కిన వేవీ మాట్లాడుకోలేదు. విద్య కొనసాగుతోంది.

ఆ సమయంలోనే కొన్ని ముఖ్యసంఘటనలు జరిగాయి. చాలాసార్లు గురువర్యులు చేసే వ్యాఖ్యానాలతో రామానుజులు ఏకీభవించలేకపోయేవారు. రామానుజల వేదాంతార్థకౌశలం యాదవప్రకాశుడికి రాళ్లు నమిలినట్లుండేది. రామానుజుని ఆలోచన ఐహికవిషయాలకు సంబంధించింది గాదు. అది సృష్టిస్థితిలయాలకు సంబంధించింది. పారమార్థికవిషయాలకు సంబంధించింది. అందువల్ల వారు త్వరగా ఒక నిర్ణయానికి రాలేకపోతున్నారు. ఆలోచించే కొద్దీ వారిసందేహాలు మరింత హెచ్చవుతున్నాయి. కానీ వారు తమ ఆలోచనలు మానలేదు.

శ్రీశైలపూర్ణుడు అప్పుడప్పుడూ తోబుట్టువు గృహానికి వచ్చినప్పుడు మేనల్లుని విశిష్టమేధ చూచి ఎంతో సంతోషించే వాడు. తన మేనల్లునిగూర్చి ఎంతో గొప్పగా శ్రీరంగం వెళ్లినపుడు, యామునాచార్యులకు చెప్పేవారు.

రామానుజులను కంటితో చూడకపోయినా, అతణ్ణి గూర్చి యామునాచార్యుడు చెవులతో విని ఆనందించేవాడు. అలాంటి వైష్ణవ యువకుడు తనకు శిష్యుడుగా లభిస్తే, అతడు తన విశిష్టాద్వైత సిద్ధాంతబీజాన్ని నాటి, నీరుపోసి, పోషించి మహావృక్షంగా చేయగలడన్న విశ్వాసం యామునాచార్యునికి కలిగింది.

ఆకాలంలో కాంచీనగరం చోళరాజధాని. ఆ కాంచీపుర రాజుకు ఒక కూతురు. ఆమెకు భూతం పట్టింది. బీభత్సం సృష్టిస్తోంది. రాజభవనంలో శాంతి కరవయ్యింది. అశాంతి నృత్యం చేస్తోంది. వైద్యులు వస్తున్నారు- పోతున్నారు. ప్రయోజనం కన్పించలేదు. వచ్చినవాళ్లందరినీ రాజకుమారి హడల గొట్టేస్తోంది. రాజుకు ఏమీదిక్కుతోచలేదు. యాదవప్రకాశుడు ఆధ్యాత్మికవిద్యలోనే గాక, మంత్రశాస్త్రంలో కూడా నిపుణుడని విన్నాడు - రాజు.

చివరి అస్త్రంగా రాజు, యాదవప్రకాశుణ్ణి పిలిపించాడు. అతడు నిజశిష్యగణంతో, మంగళవాద్యాలు మధ్య రాజప్రాసాదంలో ప్రవేశించాడు. రాజకుమారి అతణ్ణి చూడగానే నిప్పురాజుకున్న ఎండుగడ్డి వలే భగ్గుమంది. "ఓయీ! యాదవప్రకాశా! నీ తెల్లగడ్డమూ, నీ ముఖతిలకమూ, నీ మంత్రగర్జనలూ నన్నేమి చేయగలవు? నీవు పండితుడవే అయినా మూర్ఖుడవు, క్రూరుడవు. ఓ మాయావాది! కపటి! దురహంకారీ! లెమ్ము. నీవు ఇక్కడ కూర్చోవడానికే అనర్హుడివి" అని ఇష్టమొచ్చినట్లు మాట్లాడింది.

ఇది అనుకోని పరిణామం! రాజుతో పాటు, సభ సాంతం నిశ్చలనచిత్రం అయింది. కనురెప్ప వాలలేదు. ఊపిరి ఆడలేదు. యాదవప్రకాశుడు శిలామూర్తి అయ్యాడు. అతని జ్ఞానేంద్రియాలు చలనంకోల్పోయాయి.

## వైకుంఠపాళి

### :: 08 - సమాధానాలు ::

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | 1 ఏ | 2 ను | గు | 3 తో | లు | 4 దా | ల్పు | |
| 5 అ | | డి | | క | | ర | | 6 వా |
| 7 రు | క్కు | | 8 క | చు | డు | | 9 సా | రు |
| ణి | | 10 సుం | | క్క | | 11 నీ | | ణి |
| | 12 మం | దు | డు | | 13 పై | లు | డు | |
| 14 అ | | డు | | 15 వి | | డు | | 16 డ |
| 17 శ | ని | | 18 పే | రి | మి | | 19 ద | శ |
| న | | 20 క | | తా | | 21 శా | | న |
| | 22 అ | ల | రు | వి | లు | తు | డు | |



అతను ఇంకా తేరుకోనే లేదు. అంతలోనే రాకుమారి మళ్లీ వికటంగా నవ్వి – "నన్ను తరమడం నీ తరమా? అదుగో నీ శిష్యులలో నీ వెనుక నిలబడి ఉన్న ఆ యువకుణ్ణి ఇలా రప్పించు. అతడు మహాత్ముడు. నీకు అదృష్టవశాత్తూ అతడు శిష్యుడయ్యాడు. ఆ రామానుజుణ్ణి, ఆ నిష్కళంక హృదయుణ్ణి, ఇలా రప్పించు" అంది.

యాదవప్రకాశుడు యంత్రంవలే దిగ్గున లేచి నిల బడ్డాడు. ఆయనే కాదు, ఆ మాటలు విన్న అందరూ విస్మయంతో కొయ్యబారి పోయారు.

యాదవప్రకాశునిమనస్సు పరిపరివిధాల పోయింది. కలుషాత్ముడైన అతనిమనసుకు రాచ కన్య మాటలు ములుకుల వలే గుచ్చుకొన్నాయి. తన గుట్టంతా రాకుమారికి తెలిసిపోయిందని తేలు కుట్టిన దొంగలా కలవరపడి పోయాడు. ఇంకా సేపు అలాగే ఉంటే ఆమె తన గురించి ఇంకేమేమి చెప్పేస్తుందోనని గజగజవణికిపోయాడు. ఎప్పుడె ప్పుడు ఆ స్థలం వదిలి వెళ్లిపోదామా? అని ఆందోళనగా ఎదురు చూస్తున్నాడు. కాలం కదల లేక కదుల్తోంది.

'రామానుజా!' యాదవప్రకాశుని నోట వెలువడిన పిలుపు. సభలో విస్మయం!

'గురువర్యా!' – శివధనుస్సు ఎత్త వచ్చిన రాముని వలే ఉన్నాడు రామానుజులు. తొలుత రాముని చూచిన శబరి వలే రాకుమారి చేతులు జోడించింది. రామానుజులు వచ్చింది కూడా గుర్తించలేదు యాదవుడు. ఏదో తెలీని భయంతో అతని చూపు శూన్యమైంది. అతను తనలో లేడు.

"గురువర్యా!" రామానుజులు మరొకమారు పిలిచారు. ఆ ధ్వనికి యాదవప్రకాశుడు మళ్లీ ఈ లోకంలోకి వచ్చాడు.

"రామానుజా! రాకుమారి పిలుస్తోంది."

"ఆచార్యదేవా! ఆమె పిలుపుతో నాకు నిమిత్తమేమి? మీ ఆదేశాన్ని పాటించడం శిష్యునిగా నా విధి."

సభ మెచ్చింది. యాదవునికి ఊరట.

"వెళ్లు నాయనా!" – మాట మృదువుగా, వాత్సల్యంగా ఉంది. రామానుజులు అడుగు ముందుకు వేశారు. కోల్పోయిన నిధి దొరికినట్లు, ఎడతెగని దాహానికి ఉన్నట్టుండి ఒక నీటిచుక్క దొరికినట్లు, రాకుమారిలో సంతోషం సముద్రమైంది.

"స్వామీ! మాయావాదాన్ని అంగీకరించని ఓ మహాత్మా! నన్నుమాత్రమే కాదు, సకలమానవ అభ్యుదయం కోసం భూమిపై అవతరించిన మహానుభావులు మీరు. ఎన్ని నోములు నోచితేనో మీ దర్శనభాగ్యం!" అంటూ రామానుజులవారి పాదాలపై వాలింది.

ఆమె శబరిని తలపించింది. అహల్య అనిపించింది.

రామానుజులు ప్రపత్తులు, 'సర్వం విష్ణుమయం' అని భావించేవారు. అంచేత..

శ్రీవరదరాజస్వామిని మనస్సులో స్మరించి, త్రికరణ శుద్ధిగా రాజకుమారిముఖాన్ని తన కరకమలద్వయంతో తాకి ఆశీర్వదించారు.

వెంటనే ఆమె స్వస్థత చెంది, మేఘం తొలగిన చంద్ర బింబముఖిలా లేచి, తల్లిదండ్రుల్ని సమీపించింది. రాజకుమారి కోమలంగా–సుందరంగా విరిగిన గులాబిలా ఉంది. రాజదంప తులు పొంగిపోయారు. గాలిలో తేలిపోయారు.

రాజు రామానుజులకు నమస్కరించి, "మహాత్మా! వేయి జన్మలెత్తినా మీ ఋణం తీర్చుకోలేం. మా దుఃఖాన్ని తొడిమతో తుంచావు. మా కుమార్తెకు కొత్తజీవితం ప్రసాదించావు. మీరు కోరింది కొంతైనా సమర్పించి, నా ఋణభారం తగ్గించు కుంటాను" అన్నారు.

ఈ సన్నివేశాన్ని ప్రత్యక్షంగా చూస్తున్న యాదవప్రకాశుని మనసు రామానుజులవారిపై అసూయతో నిండిపోయింది. కడుపు మండిపోయింది. లోలోపల సిగ్గుతో క్రుంగిపోతున్నా – పైకిమాత్రం తెచ్చిపెట్టుకున్న గాంభీర్యాన్ని ప్రదర్శించసాగాడు. తన ఔన్నత్యానికి విఘాతమేర్పడిందని లోలోపల కుమిలిపో సాగాడు. ఆ నిష్పత్తిలో శిష్యునిపై మరింత అసూయాభావాన్ని పెంచుకున్నాడు. శిష్యునిగొప్పతనాన్ని పుత్రవాత్సల్యంతో స్వీక రించలేని పండితుడతడు. ప్రేమను స్వీకరించి, క్రూరత్వాన్ని ప్రతిఫలంగా ఇచ్చిన అపరద్రోణాచార్యుడతడు.

రామానుజులపై ప్రేమకు బదులు, పగను పెంచు కున్నాడు–యాదవప్రకాశుడు.

చ. పగ యడఁగించు టెంతయు శుభం; బది లెస్స; యడంగునే పగం
బగ? వగగొన్న మార్కొనక పల్కక యుండఁగ వచ్చునే? కడుం
దెగ మొదలెత్తిపోవఁ బగ దీర్పఁగ వచ్చినఁ గ్రౌర్య మొందు; నే
మిగతిఁ దలంచినం బగకు మేలిమి లేమి ధ్రువంబు గేశవా!

(మహాభారతం, ఉద్యోగపర్వం.3-21)

పగవారిచేత వగగొన్నధర్మరాజునోట వెలువడ్డ వెలలేని సూక్తి ఇది. పగ పొగలాంటిది. నిర్మలమైన వాతావరణాన్ని కలుషితం చేస్తుంది. నిజాన్ని మారుస్తుంది. మనసులోని మమతను మారణహోమం చేస్తుంది. పగ కోరేది పరాయివాళ్ల వగ. వగనొందిన విరోధుల్ని చూచి, పగలబడినవ్వుతుంది. పగవారు కల్పించిన పగతో నలిగి నాశనమయ్యేవాడు బల హీనుడు. బలవంతుడు పగను వగతో ఢీకొంటాడు. బలాబలా లను పరీక్షించుకొంటారు. కానీ, సంఘర్షణలో శాంతి నశి స్తుంది. కరుణకు బదులు క్రౌర్యం విలయతాండవం చేస్తుంది. క్రౌర్యం మానవుణ్ణి క్రూరజంతువులా మారుస్తుంది.

ఇదే పరిస్థితి యాదవప్రకాశునిదికూడా. లోలోపల రామా నుజులను ఏమి చేయాలని పాచికలు వేస్తూనే ఉన్నాడు.

రామానుజులవారు గురువుగారిఅంతరంగం తెలిసిన వారు, ఇదివరకే వారివేటునుండి దైవసహాయంతో తప్పించు కున్నవారు. ఇక గురువుగారిలో మాత్సర్యం పెంచదలచుకోలేదు. అందుకే రాజుతో – "ప్రభూ! నేను గురువుగారిశిష్యుడనే! నేను వారిసొమ్ము. వారివిద్యాపీఠంలో శిష్యత్వంలో ఉన్నాను. కనుక నేను కోరదగిందేమీ లేదు. అలా కోరుకునే అధికారమూ లేదు. నాకు కన్పించని ఆ దైవానికి, కళ్లెదుట కన్పిస్తున్న ప్రత్యక్షదైవ మైన నా గురుదేవునికి దాసానుదాసుణ్ణి. ఇక ఇదంతా దైవ కృపకు గురుకటాక్షం. ప్రజారక్షకులైన ప్రభువులకు మేము సహాయపడినందుకు మేమూ ధన్యులమే అయ్యాం. మీ కృత జ్ఞతలన్నీ మా గురువర్యులకే చెందాలి!" అని సవియంగా పలికి రాచమర్యాదలను, రాజలాంఛనాలను తిరస్కరించారు. వారి వినయానికి రాజసభ హర్షధ్వానాలు చేసింది.

రామానుజులవారి మనసు మందాకినిలా నిర్మలమైం దని మరొకమారు ఋజువైంది. అయినా ఏం లాభం? యాదవ ప్రకాశుడు, శిష్యుడు నిండుసభలో తనకిచ్చిన గౌరవాన్నికూడా నిలుపుకోలేకపోయాడు. దాన్నికూడా పరాభవంగానే భావించి, శిష్యునిపై అనిర్వచనీయమైనక్రోధాన్నే మరింతపెంపు చేసు కున్నాడు. ఈర్ష్య అతణ్ణి అంధకారమై అలుముకున్నా, పైకి ఆనందాన్ని అభినయిస్తూ, శిష్యుణ్ణి ఆశీర్వదించి, రాజమందిరం నుండి తన ఆశ్రమానికి వచ్చేశాడు.

వెంటనే రామానుజులను పిలిపించి, "రామానుజా! ఏ మంత్రంతో నీవు ఆ రాకుమారికి పట్టిన పిశాచాన్ని వదల గొట్టావు" అని ప్రశ్నించాడు. రామానుజులు– "గురుదేవా! ఇందులో నా ప్రతిభ ఎంతమాత్రమూ లేదు. నేను ఏ మంత్రమూ పఠించలేదు. రాకుమారిస్వస్థతకు కారణం ఆమెకు నాపై గల విశ్వాసమే! నావరకు నేను భగవంతునిశక్తిని తలచుకుని, ఆమెకు స్వస్థత కలగాలని త్రికరణశుద్ధిగా కోరు కున్నాను. అంతే తప్ప మీరనుకుంటున్నట్లు నేను ఏ మంత్రమూ వినియోగించలేదు" అని ప్రత్యుత్తరమిచ్చారు. తన శిష్యుడి సమాధానం యాదవప్రకాశుడికి ఎంతవరకూ ఊరట కలిగిం చిందో, ఆయనకే ఎఱుక!

(ఇంకా ఉంది)

## రచయితలకు మనవి

**సప్తగిరి వ్యాసరచయితలకు అందించే పారితోషి కాన్ని వారిబ్యాంకు అకౌంటులో జమచేయాలని తి.తి.దే. నిర్ణయించింది.**

**కనుక,రచయితలు వ్యాసంతో పాటు బ్యాంకు పాసు బుక్కు మొదటి పేజి జిరాక్సు కాపీ, బ్యాంకు వివరాలు, అకౌంటు నెంబరు, ఐ.ఎఫ్.ఎస్.సి. కోడ్, ఇంటి చిరునామా, సెల్‌ఫోన్ నెంబరును స్పష్టంగా రాసి, జతచేసి పంపవల సిందిగా కోరుతున్నాము.** **- ప్రధాన సంపాదకుడు**

ఉత్తమశిష్యులకు ఉత్తమగురువులూ,
ఉత్తమగురువులకు ఉత్తమశిష్యులూ లభించడం -
ఆ గురుశిష్యులు చేసుకొన్న సుకృతఫలం!

ఈ నేపథ్యంలో ....
గురుతత్త్వం, ప్రథమ గురువులు ఎవరు?
గురువుల తపన ఎలా ఉంటుంది?
గురువుల మహత్త్వం ఏమిటి?
విద్యాదానం ఎలాంటి మహిమ కలది?
వంటి ఎన్నో అంశాలు
ఈ వ్యాసంలో చదువవచ్చు.....



# గురువులంటే...

- పద్మశ్రీ, మహామహోపాధ్యాయ పుల్లెల శ్రీరామచంద్రుడు

మానవుడు తనజ్ఞానాన్ని క్రమక్రమంగా వృద్ధి పొందించు కోడానికి ఎన్నో సాధనాలు ఉన్నాయి. అయితే - వాటి అన్నింటిలో అత్యంతప్రధానమైన సాధనం శబ్దం; అంటే- మాట లాడగలిగిన, మాటల్ని అర్థం చేసుకోగలిగినశక్తి. దీని ద్వారా మానవుడు తన మనస్సులోని వివిధభావాలను ఇతరు లకు తెలుపగలుగుతున్నాడు. వాళ్ల భావాలను తెలుసుకొనగలుగు తున్నాడు. ఈ శబ్దం సహాయంతో మానవుడు కేవలం తన ప్రక్కనున్న సమకాలికుల భావాలను, ఆలోచనావిధానాలను మాత్రమే కాకుండా తనకంటే ఎన్నో వేలసంవత్సరాలకు ముందు జీవించినవాళ్ల భావాలనుకూడా తెలుసుకొనగలుగుతున్నాడు. తన భావాలను, తన సమకాలికసమాజంలో బహుళప్రచారంలో ఉన్నభావాలనుకూడా రాబోయే తరాలవారికి అందజేయగలుగు తున్నాడు.

అందుచేతనే దండి అనే ఒక మహాకవిపండితుడు **"శబ్దం అజ్ఞానమనే అంధకారాన్ని పటాపంచలు చేసే ఒక మహా తేజస్సు" అంటూ-"ఈ ప్రపంచకం ప్రారంభం అయిన నాటి నుండీ ఈ శబ్దమనే మహాజ్యోతిస్సు ప్రకాశిస్తుండకపోతే ఈ మూడులోకాలూ గ్రుడ్డివైపోయి ఉండేవి" అని పేర్కొన్నాడు.**

## ప్రథమగురువులు

భారతీయ తత్త్వశాస్త్రం ప్రకారం-జ్ఞానం బ్రహ్మస్వరూపం, జ్ఞానమే బ్రహ్మ, బ్రహ్మయే జ్ఞానం. ప్రతీ బాలునిహృదయంలోను ప్రప్రథమంగా జ్ఞానబీజాలు నాటినవాళ్లు తల్లిదండ్రులు. బాలుడు తల్లిదండ్రులనుండి ఎన్నో విషయాలు ప్రత్యక్షంగాను, పరోక్షం గాను నేర్చుకుంటాడు. అందుచేత వాని ప్రథమగురువు తల్లిదం డ్రులు. వయస్సు పెరిగేకొద్దీ ఆ యా విద్యాస్థానాలలో గురువుల నుండి వివిధవిషయాలు, విద్యలూ అభ్యసిస్తాడు. బోధించిన విషయం అత్యల్పమైనా, అత్యున్నతమైనా ఆ విషయాలను బోధించిన ప్రతి ఒక్కరూ గురువే. విషయాలలో ఉన్న అల్పత్వ- ఉన్నతత్వాలు నేర్చుకొనేవాని వయోభేదాన్ని, బుద్ధితారతమ్యాన్ని బట్టి ఉంటాయి. జ్ఞానం అంటే బ్రహ్మమే కదా? అందుచేతనే జ్ఞానప్రదాత సాక్షాత్తు పరబ్రహ్మమే అన్నారు- పెద్దలు.

ఆ పరబ్రహ్మకు సంబంధించిన విభిన్నరూపాలే (చతు ర్ముఖ) బ్రహ్మ- విష్ణు-పరమేశ్వరులని శాస్త్రసిద్ధాంతం. అందుచేత సాక్షాత్తు పరబ్రహ్మస్వరూపుడే అయిన గురువు బ్రహ్మ- విష్ణు-పర మేశ్వరస్వరూపుడుకూడా అని చెప్పడం శిష్యునికి సంబంధించి నంతవరకు ఆ గురువుకున్న వైశిష్ట్యాన్ని స్పష్టీకరించడమే. ప్రతీ మానవుడు జీవితాంతంవరకు ప్రతిదినమూ స్మరించవలసిన ఈ విషయమే 'గురు ర్బ్రహ్మ' అనేశ్లోకంలో చెప్పబడింది.

## గురువులతపన

సమాజక్షేమాన్ని కోరే ఒక ఉత్తమగురువు తాను శ్రమపడి సంపాదించినజ్ఞానాన్ని అర్హతగలవారికి ఎలా అందజేయాలా అని నిత్యమూ తహతహలాడుతుంటా డని తైత్తిరీయోపనిషత్తులో చెప్పబడింది. అతడు ఈ విధంగా అనుకొంటూ అగ్నిలో హోమాలు చేస్తాడట!

గొప్పమేధాశక్తి కలవాళ్లు, ఇంద్రియాలను అదుపులో పెట్టు కొన్నవాళ్లు, క్రోధం మొదలైన చిత్తదోషాలు లేనివాళ్లు అయిన విద్యార్థులు వివిధప్రయోజనాలను చేకూర్చేవి, ఐహికంగాను, ఆముష్మికంగాను అనేకమైన సత్ఫలితాలను ఇచ్చేవి అయిన విద్యలు నేర్వడానికై నాదగ్గరకు అన్ని వైపులనుండీ వత్తురుగాక! ఇలా గురువు అనుకోవడంలో అతనిశిష్యులు మంచిమనస్సు, ఏకాగ్రత, శాంతం, పారమార్థిక చింతన కలిగి ఉండాలనేది - అతని ఆశయం!

## గురువులమహత్త్వం

జ్ఞానాన్ని పంచిపెట్టడంలో ఇంతటి ఆసక్తి ఉండడంచేతనే ప్రతీ గురువు తనతో సమానమైన ఎందరో శిష్యులను తీర్చి దిద్ది, సమాజానికి ఉపకారం చేయగలుగుతాడు. అందుచేతనే శ్రీ శంకరాచార్యులు ప్రపంచంలో ఉత్తమగురువుకు సాటి ఎవరూ లేరు, ఏదీ లేదు అంటారు–శతశ్లోకిలో.

జ్ఞానదానం చేసిన సద్గురువుకు తగిన దృష్టాంతం మూడు లోకాలలోనూ కనబడదు. "స్పర్శమణి (పరుసవేది) ఇనుప ముక్కను బంగారంగా మారుస్తుంది. దాన్ని దృష్టాంతంగా చూప వచ్చును కదా?" అంటే అది యుక్తం కాదు. ఎందువల్ల అంటే బంగారంగా మారిన ఇనుపముక్క మరొక ఇనుప ముక్కను బంగారంగా మార్చజాలదు. కానీ గురువు తనపాదాలు ఆశ్రయిం చిన శిష్యుణ్ణి తనవంటివాణ్ణి చేయగా అతడు మళ్లీ మరొకర్ని కూడా తనం తటివాణ్ణి చేస్తాడు. ఈ పరంపర అవిచ్ఛిన్నంగా తరతరాలపాటు కొన సాగుతూనే ఉంటుంది. అందుచేత సద్గురువుకు ఉపమానం లేనే లేదు. గురువు లోకోత్తరుడు. లోకంలో అందరినీ మించినవాడు.

**గురువు వేర్వేరు శాస్త్రాలనుండి అనేకవిషయాలు సేకరించి, బోధించడమే కాకుండా- తన శిష్యులు తాను చూపిన సన్మార్గంలో స్థిరంగా నిలచేటట్లు చేస్తాడు. అంతేకాక వాళ్లకు బోధించిన నియమావళిని తాను కూడా నిశ్చితంగా పాటిస్తాడు. అలాంటి గురువే ఆచార్యుడనడానికి అర్హుడు**

**- మనుస్మృతి.**

## విద్యాదానమహిమ

"అన్నదానం గొప్పదానమైతే విద్యాదానం దానికంటే గొప్పది. అన్నంవల్ల కలిగే తృప్తి క్షణిక మైంది. విద్యవల్ల కలిగే తృప్తి యావజ్జీవమూ ఉంటుంది" అని ఒక ప్రసిద్ధమైన శ్లోకభావం.

ఒకనికి విద్యలు నేర్పితే – ఆ విద్యాసాహాయ్యంతో అన్నా దులు అతడే సంపాదించకొనగలుగుతాడు కదా?

విద్యాదాన గొప్పతనాన్ని ఆంధ్రమహాభారతం ఈ విధంగా వర్ణించింది.

**జ్ఞానము కేవల కృప న**
**జ్ఞానికి నుపదేశవిధిఁ బ్రకాశము సేయం**
**గా నది సకలధరిత్రీ**
**దానంబునకంటె నధికతరఫలద మగున్**

**(మహాభారతము శాంతి. 4.255)**

"స్వార్థచింత లేకుండా కేవలం దయతో, ప్రేమతో, జ్ఞానం లేనివానికి ఉపదేశించి, వానిలో జ్ఞానమనే దీపం ప్రకాశింప చెయ్యాలి. అలా చేసినవానికి ఈ భూమండలం అంతా దానం చేసిన ఫలం, పుణ్యం లభిస్తుంది.". అయితే–"గురువు కొన్నివిద్య లలో మహాపండితుడైనంతమాత్రాన సరిపోదు. తనకున్న జ్ఞానాన్ని శిష్యులకు అందించగల నేర్పునుకూడా అతడు అనుదినమూ పెంపొందించు కోవాలి. అలాంటి గురువే ఉత్తము డైన ఉపాధ్యాయుడు" అని కాళిదాసు "మాళవికాగ్నిమిత్రం" అనే నాటికలో అంటాడు.

ఒక ఉపాధ్యాయునివిద్య వానిలో ఉన్నంతవరకే బాగుంటుంది. మరొకని విద్య వాని శిష్యులలో రాణిస్తుంది. ఎవని విద్య రెండువిధాలా కూడా బాగా రాణిస్తుందో ఆతణ్ణి ఉపాధ్యాయులలో అగ్రస్థానంలో కూర్చోబెట్టాలి.

## ఆచార్యుడు

శిష్యులకు ఆ యా గ్రంథాలలో ఉండే వివిధవిషయాలు బోధించి, వాళ్లను గొప్ప విద్యావంతుల్ని చేయడం ఎంత ప్రధానమో–వాళ్లను ఉత్తమసం స్కారవంతుల్ని, మంచి నడవడిక గల ఉత్తమపౌరులుగా– తీర్చిదిద్దడం అంత కంటే ప్రధానమైంది. ఈ కార్యం గురువు కేవలం మాటలతో చేసిన ఉప దేశాలకంటే అధికంగా తాను అవలంబించిన నిర్దుష్టజీవన విధానంద్వారా చేయగలుగుతాడు. ఇలా చేసిన సన్మార్గోపదేశం విద్యార్థులమనస్సులలో జీవితాంతం నిలిచిపోతుంది. ఇలాంటి గురువుకే ఆచార్యుడు అని పేరు.

ఎంతటివారి కైనా ఒకప్పుడు పొరపాటు తప్పదు. "మేము చేసిన మంచిపనులుమాత్రమే నువ్వు ఆచరించాలిగాని ఎప్పుడైనా మేము ప్రమాదవశాత్తు శాస్త్రవిరుద్ధంగా ప్రవర్తిస్తే నువ్వుకూడా అలా ప్రవర్తించకూడదు" అని గురువు శిష్యుణ్ణి హెచ్చరిస్తాడు.

ఈ విషయంలో గురువులకుండే బాధ్యత తల్లిదండ్రులకు కూడా ఉంది. వాస్తవంలో ఈ కాలంలో వాళ్లపై ఎక్కువ ఉంది. పూర్వం విద్యాభ్యాసంకోసం శిష్యులు తల్లిదండ్రులకు దూరంగా గురుకులాలలోనే ఉండేవాళ్లు. ఈ కాలంలో విద్యాస్థానాలలో కంటే అధికకాలం విద్యార్థులు తల్లిదండ్రులదగ్గరనే ఉండడం



చేత వాళ్లు ఆదర్శమయమైన జీవితాలు గడపడంద్వారా పిల్లలకు సన్మార్గోపదేశం చేయవలసిఉంటుంది.

బాలులకు ఆ వయస్సులో తల్లిదండ్రులూ, గురువులూ మాత్రమే అత్యంతఆదరపాత్రులైనవాళ్లు. వాళ్లు చెప్పిందీ, చేసిందీ కూడా ఆ బాలులమనస్సులలో పరమప్రమాణంగా నిలిచి పోతాయి. శ్రీకృష్ణుడు భగవద్గీతలో చెప్పిన–

యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః ।
స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే ॥ (గీత 3-21)

"శ్రేష్ఠుడైన వ్యక్తి ఏ పని చేస్తే ఆ పనే ఇతరజనులందరూ చేస్తారు. అతడు దేన్ని ప్రమాణంగా గ్రహిస్తాడో దాన్నే వాళ్లు కూడా ప్రమాణంగా గ్రహిస్తారు" అనే మాట విద్యార్థిదశలో ఉన్నవాళ్లవిషయంలో నూటికి నూరుపాళ్లు సత్యమైంది.

ఆ వయస్సులో వాళ్లదృష్టిలో తమ తల్లిదండ్రులను, గురువులను మించిన శ్రేష్ఠవ్యక్తులుండరు.



## తిరుమలలో... కల్యాణవేదిక ఉచితం!!



- తిరుమలలో వివాహం చేసుకోదలచిన వధూవరులకు తిరుమల తిరుపతి దేవస్థానం కల్యాణవేదికను ఉచితంగా అందచేస్తోంది.
- ఇక్కడ వివాహం చేసుకునే వధూవరులకు స్వామివారి తరపున పసుపు కుంకుమ, కంకణాలు, శ్రీవారిప్రసాదం (పది ఉచిత లడ్డూలు) అందజేస్తారు.
- రూ.50/- రుసుము కలిగిన వసతిగది ఒకదానిని ఆ వధూవరులకు ఒకరోజు ఉచితంగా ఇస్తారు.
- అదనపుగది కావలసినవారు అప్పడు లభించే దాన్ని బట్టి రూ.50/- చెల్లించి పొందవచ్చు.
- వధూవరులతో పాటు మొత్తం ఆరుమంది సభ్యులకు ప్రత్యేక ప్రవేశ దర్శనం (రూ.300/-) ద్వారా పెళ్లి తర్వాత 12 గంటల లోపు లేక అప్పటికి అందుబాటులో ఉన్న ప్రత్యేకప్రవేశదర్శన వేళల్లో శ్రీవారి దర్శనం ఉచితంగా పొందవచ్చు.
- ఈ ఆరుగురు ఒక లడ్డు రూ.25/- చొప్పున చెల్లింపు పద్ధతిపై ఒక్కొక్కరు రెండు లడ్డూలు పొందవచ్చు.
- ఈ కల్యాణవేదికను వివాహ సమయానికి తొంబైరోజులకు ముందుగా, మూడురోజుల లోపు తి.తి.దే. వెబ్‌సైట్ / స్థానిక ఈ-దర్శన్ కేంద్రాలలో బుక్కింగ్ చేసుకోవచ్చు.
- కల్యాణవేదికకు ఆరుగంటల ముందుగా వచ్చికూడా కరెంటు బుక్కింగ్ సదుపాయం వినియోగించుకోవచ్చు.
- ఆన్‌లైన్, ఈ-దర్శన్ కేంద్రాలలో కల్యాణవేదికను బుక్కింగు చేసు కున్నవారు-పెళ్లిసమయానికి ఆరుగంటలలోగా, సంబంధిత అధికారులను సంప్రదించి, తగు ఆధారాలను ఒరిజినల్స్ చూపించి, ఒకసెట్టు జిరాక్సు ప్రతులను అందజేయాలి.
- మరిన్ని వివరాలను కల్యాణవేదిక ఫోన్ నెం. 0877- 226 3433 నందు గాని, తిరుమల తిరుపతి దేవస్థానం వెబ్‌సైట్ (www.tirumala.org)నందుగాని పొందవచ్చు.

- ఉపకార్యనిర్వహణాధికారి (కె.కె.సి.)

## తిరుమలలో భక్తులు చేయవలసినవి

- ☑ తిరుమలకు బయలుదేరేముందు మీమీ ఇష్టదేవతలను పూజించండి.
- ☑ శ్రీవేంకటేశ్వరస్వామిని దర్శించే ముందు శ్రీవారిపుష్కరిణిలో స్నానంచేసి, శ్రీవరాహస్వామిని పూజించండి.
- ☑ ఆలయంలో పూర్తిగా నిశ్శబ్దాన్ని పాటిస్తూ **"ఓం శ్రీ వేంకటేశాయ నమః"** అని మీలో మీరు శ్రీవారిని స్మరించండి.
- ☑ ఆలయంలో ఉన్నపుడు మీ ధ్యానం స్వామివారి పైనే ఉంచండి.
- ☑ తిరుమల సమీపంలో ఉన్న ఆకాశగంగ, పాపవినాశనం తీర్థాలలో స్నానంచేయండి.
- ☑ తిరుమలలో ఉన్నపుడు మన సనాతనసంప్రదాయాలు, ఆచారవ్యవహారాలను విధిగా పాటించండి.
- ☑ మీ కానుకలు శ్రీవారి హుండీలోనే సమర్పించండి.
- ☑ తిరుమలపరిసరాలను శుభ్రంగా ఉంచండి.
- ☑ బయోడీగ్రేడబుల్ ప్లాస్టిక్‌కవర్లను మాత్రమే వినియోగించండి.
- ☑ స్వామివారి దర్శనానికి సంప్రదాయ దుస్తులతోనే రండి.

## తిరుమలలో భక్తులు చేయకూడనివి

- ☒ శ్రీవారిదర్శనంకోసం కాకుండా ఇతరఉద్దేశాలతో తిరుమలకు రాకండి.
- ☒ తిరుమలయాత్రలో మనస్సును ఇతర విషయాలపై లగ్నం చేయకండి.
- ☒ ఆచారవ్యవహారాలప్రకారం ఆలయార్హత లేని సందర్భాలలో ఆలయంలోకి రాకండి.
- ☒ తిరుమలగిరులలోని విరులన్నీ శ్రీవారిసేవకే!
- ☒ శ్రీవారిదర్శనంకోసం త్వరపడకండి. క్యూలో మీవంతు వచ్చేవరకు ఆగండి.
- ☒ అన్నప్రసాదాల్ని వృథా చేయకండి.
- ☒ విలువైనఆభరణాలు, ఎక్కువడబ్బు మీవద్ద ఉంచుకోకండి.
- ☒ నీరు, విద్యుత్తు వృథా చేయకండి.
- ☒ అపరిచితులను వసతిగృహాలలోకి అనుమతించకండి, వారిని నమ్మి, గదితాళాలు ఇవ్వకండి.
- ☒ నాలుగుమాడవీథుల్లో పాదరక్షలు ధరించకండి.
- ☒ బయోడీగ్రేడబుల్ ప్లాస్టిక్‌కవర్లను తప్ప ఇతరాలను వినియోగించకండి.

## తిరుమలలో నిషేధం

- ⦸ తిరుమలలో ధూమపానం, మద్యపానం, మాంసాహారం మొదలైనవి పూర్తిగా నిషేధం.
- ⦸ శ్రీవారిదర్శనం, వసతికోసం దళారీలను ఆశ్రయించకండి.
- ⦸ వీథివర్తకులనుంచి నకిలీప్రసాదాలు కొనకూడదు.
- ⦸ ఆలయప్రాంగణంలో ఉమ్మివేయడం వంటి అసహ్యకరపనులు చేయకండి.
- ⦸ అన్యమతప్రచారం పూర్తిగా నిషేధం.
- ⦸ వివిధరాజకీయసభలు, బ్యానర్లు, ధర్నాలు, రాస్తారోకోలు, హర్తాళ్‌లు మొదలైనవి తిరుమలలో నిషేధం.
- ⦸ తిరుమలలో పేకాట, జూదం వగైరాలు పూర్తిగా నిషేధం.
- ⦸ ఆలయంలోకి సెల్‌ఫోన్, కెమెరా వంటి పరికరాలను, ఆయుధాలను తీసుకువెళ్లకూడదు.
- ⦸ జంతువధ నిషేధం.
- ⦸ భిక్షుకులను ప్రోత్సహించకూడదు.
- ⦸ స్వామి పుష్కరిణిలో సబ్బు, షాంపూలు నిషేధం.
- ⦸ స్వామివారి పుష్కరిణిలో బట్టలు ఉతకరాదు.

జూలై 13వ తేదీ పెరియాళ్వారు తిరునక్షత్రం సందర్భంగా...

# పెరియాళ్వారులు

- డా॥ చెలికాని మురళీకృష్ణారావు,
9440009535



పెరియాళ్వారు-వీరినే విష్ణుచిత్తులు అనికూడా ప్రజలు అంటారు. సర్వవేళలా విష్ణువునే చిత్తములో నిలుపుకున్న భక్తాగ్రేసరుడే ఈ విష్ణుచిత్తుడు. వీరు శ్రీవిల్లిపుత్తూరులో బ్రాహ్మణకులంలో, కలియుగం 47వ క్రోధనామసంవత్సరం ఆనినెల శుక్ల పక్షం ఏకాదశి, ఆదివారం స్వాతినక్షత్రాన గరుడాంశలో పుదమై అమ్మగారికీ, ముకుందాచార్యులకూ పుత్రులుగా అవతరించారు.

శ్రీ విల్లిపుత్తూరులో నందనవనాన్ని ఏర్పరుచుకొని భగవంతునికి పుష్పమాలలు సమర్పించేవారు. అప్పుడు పాండ్యరాజు శ్రీవల్లభరాయలు, మధురానగరంలో, కూడల్ అనేచోట రాజ్యపాలన చేస్తున్నాడు.

ఒక సందర్భంలో ఒక బ్రాహ్మణుడు చెప్పిన ప్రకారం "ఈ లోకంలోనే పరలోకానికి కావలసినదాని కోసం ప్రయత్నం చేయాలి" అనేమాటను పాండ్యరాజు గుర్తు చేసుకొని, తన పురోహితుడైన శెల్వానంబిని పిలిచి, పరతత్త్వాన్ని ఎలా నిర్ణయించాలని ప్రశ్నించాడు.

వేంటనే శెల్వానంబి, విద్వాంసులను రప్పించి, వాదోపవాదాలు ఏర్పాటుచేసి, ధనంతో నింపబడ్డ బంగారుచిలుక నొకదాన్ని, సభామండపం మధ్యభాగంలో ఒక తోరణంగాకట్టి, ఆ చిలుక ఏ విద్వాంసుణ్ణి, సూచిస్తే! అతనివాదమే శ్రేష్ఠమని, అంగీకరించేటట్టు ఏర్పాటు చేసాడు.

విష్ణుచిత్తులకు భగవంతుడు కలలో కనిపించి, ఆ సభామండపానికి వెళ్ళి, పరతత్త్వం ప్రబోధించమని ఆదేశించాడు. ఆ ప్రకారం విష్ణుచిత్తులు సభామండపానికి వెళ్లారు. అక్కడున్న ఉన్న విద్వాంసులు, విష్ణుచిత్తులకు ఆ సభలోని వాదోపవాదాలలో ప్రవేశం లేదన్నారు. అయినా శెల్వ నంబి విష్ణుచిత్తులవారిని ఆ చర్చలలో పాల్గొన వలసిందేనన్నారు. పాండ్యరాజు విష్ణుచిత్తుణ్ణి పట్టపుటేనుగుమీద ఊరేగించి, వారికి **"పట్టరుపిరాన్"** అనే నామాన్ని బహూకరించాడు.

అనంతరం విష్ణుచిత్తులు బోధించిన పరతత్త్వానికి అందరూ ఆశ్చర్యపోయారు. ఆ బంగారుచిలుక విష్ణుచిత్తులవారివైపే మొగ్గుచూపింది. దీంతో-

ఆ సందర్భంలో ఒక అద్భుతసంఘటన జరిగింది. శ్రీమన్నారాయణుడు లక్ష్మీదేవితో పరివారసమేతంగా, గరుత్మంతుణ్ణి అధిరోహించి, ఆకాశమార్గంలో సాక్షాత్కరించాడు. ఆ స్వామిని చూచి, భక్తిపారవశ్యంతో మంగళాశాసనం చేశారు- విష్ణుచిత్తులు. అప్పటినుండి విష్ణుచిత్తులవారిని **"పెరియాళ్వారు"** అన్నారు.

తాను పెంచి పెద్దచేసిన గోదాదేవిని, ఆ పరమాత్మకు సమర్పించి, స్వామికి మామగారు అవటంవల్లకూడా వీరిని "పెరియాళ్వారు" అంటారు. తాము నిత్యం స్వామికి పుష్పకైంకర్యం చేయటంవల్ల మాలాకారులు అనే పేరుకూడా వచ్చింది. వీరు ఎనభైఅయిదుసంవత్సరాలు స్వామికి సేవచేసి పరమపదంచేరారు.

వీరు రచించిన ప్రబంధాలు రెండు-

**1. తిరుపల్లాణ్డు -**

ఇది 12 పాశురాల ప్రబంధం. వైష్ణవుల నిత్యానుసంధానంలో ఈ ప్రబంధ పారాయణం తప్పనిసరి.

**2. పెరియాళ్వారు తిరుమొళి -**

ఇందులో శ్రీకృష్ణావతారం, బాలకృష్ణుని మధురలీలలు వర్ణిస్తూ 461 పాశురాలు ఉన్నాయి.



# వందే గురుపరంపరామ్

- డా॥ కంపల్లె రవిచంద్రన్, 98487 20478

శ్లో॥ అజ్ఞానతిమిరాంధస్య జ్ఞానాంజనశలాకయా।
చక్షురున్మీలితం యేన తస్మై శ్రీగురవే నమః ॥

అజ్ఞానమనే అంధకారంచే కప్పబడి ఉండే నా కండ్లను, శుద్ధజ్ఞానమనే కాటుకకమ్మీతో తెరిపించిన గురువుకు నమస్కారం!

ఇక్కడ చర్మనేత్రాలకు సంబంధించిన అంధకారం కాదు - ఆ కండ్లు బాగనే ఉంటాయి. బయటివస్తువులు కన్పిస్తూనే ఉంటాయి. కానీ, లోపలితత్త్వాన్ని దర్శించే మనోనేత్రం అజ్ఞాన మనే చీకటితో మూసుకపోయింది. ఆ కన్ను తెరుచుకోవాలంటే దానికి జ్ఞానమనే మందుకాటుక- కమ్మీతో (పుల్లతో) పూయాలి. అది శిష్యుడు స్వయంగా పూసుకోలేడు. ఆ వైద్యం చేసేవాడు గురువు. ఆయన తనకు పూర్వగురువునుండి సంక్రమించిన జ్ఞానమనేకాటుక సమృద్ధిగా కలవాడు. తన ప్రబోధమనే కమ్మీతో - జ్ఞాననేత్రం తెరువబడి, శిష్యునికి ఆంతరదృష్టి సమకూరి, హృదయకమలంలో ఉన్న ఈశ్వరుణ్ణి దర్శిస్తాడు. 'గురు' శబ్దానికుండే అర్థం అంతగొప్పది!

'అర్థస్యపురుషో దాసః' మానవుడు ధనదాసుడు. ధనదాస్యం మానవుణ్ణి తేలికచేస్తుంది; తేజాన్ని తగ్గిస్తుంది, పతనానికి దారితీస్తుంది. అయినా ప్రపంచంలో నూటికి తొంబైతొమ్మిదిమంది ధనదాసులే. కానీ, ప్రపంచంలో ఈ ధనదాసత సోకగూడని చోటొకటి ఉంది. అదే గురుపీఠం. జీవితంలో ధనానికి దాసోహమ్మనగూడనివ్యక్తి ఒకడున్నాడు. అతడే గురువు.

ఉత్తమగురువు సూర్యభగవానునివంటివాడు. నభోమండలాన్ని అధిష్ఠించి, స్వార్థరహితంగా తనతేజఃకిరణాలు ప్రసరించి, చీకట్లను పారద్రోలి, ప్రపంచానికి వెలుగు నిచ్చి, ప్రజలప్రార్థనలందుకొనే ప్రత్యక్షదైవం సూర్యభగవానుడు. అట్లే సమాజంలో మహోన్నత గురుపీఠాన్ని అధిష్ఠించి, స్వార్థరహితుడై, జ్ఞానదీప్తే ధనంగా, జ్ఞానదానమే జీవితధ్యేయంగా విజ్ఞానదీప్తులను వెదజల్లవలసినవాడు, వ్యక్తుల జీవితాలకు వెలుగుచూపాల్సినవాడు - గురుదేవుడు. అధికారైశ్వర్యాలు ఆ తేజోమూర్తిముందు తలలువంచి నిలువవలసిందే!

**అవతారపురుషులైనా, చక్రవర్తులైనా ఆ గురువులముందు శిష్యులే!**
**అలాంటి గురుపరంపరపై ప్రత్యేకవ్యాసం మీకోసం....**

ప్రతిజీవీ పరిపూర్ణతను పొందడానికే ప్రయత్నిస్తాడు. పర్యవసానంలో ప్రతిప్రాణీ ముక్తినొందడం తథ్యం. మన ఇప్పటి స్థితి పూర్వకర్మల ఆలోచనా ఫలితం. ఇట్లే మనభవిష్యత్ జీవితం మన ఇప్పటికర్మల, భావాలపై ఆధారపడి ఉంటుంది. కనుక మనభవిష్యత్తు ఆనందమయం కావాలంటే సద్భావాలూ, సత్సాంగత్యం, సత్కర్మాచరణం, ఎంతో అవసరం.

ఇలాంటివి కల్గడానికి– మనల్ని ఇందుకు ప్రేరేపించడానికీ ఒక చైతన్యవంతమైన శక్తి కావాలి. ఆ శక్తి లభిస్తే ఆత్మశక్తిసామర్థ్యాలు ప్రకాశిస్తాయి. అప్పుడు మానవుడు పావనుడై పరిపూర్ణుడౌతాడు. పుస్తకాల నుండి ఈ ప్రకాశకశక్తి సిద్ధించదు.

ఆత్మ మరొకఆత్మవల్లనే ప్రేరణం పొందాలి. జీవితాంతం తాత్త్వికగ్రంథాలు చదివినా ఆత్మవికాసం కల్గడం అసంభవం. గ్రంథపఠనంవల్ల బుద్ధి వికసిస్తుందే కానీ, ఆత్మవికసించదు. కనుక ఆత్మజ్యోతిని ప్రకాశింపజేయాలంటే అందుకు తగిన ప్రేరణశక్తి మరొక ఆత్మనుండే ప్రసరించాలి. ఇలాంటి ప్రేరణశక్తి ఎవనినుండి ప్రసరిస్తుందో అతడే గురువు. ఆ శక్తిని గ్రహించేవాడే శిష్యుడు.

గురువు ఉత్తమజ్ఞానియై, మరొకఆత్మను ప్రేరేపించడానికి కావాల్సిన శక్తి గలవాడై ఉండాలి. శిష్యుడు నిర్మలత్వం, నిరహంకారం కల్గి, గురువు ఇచ్చేశక్తిని గ్రహించి, ధరించే యోగ్యతకలవాడై ఉండాలి. ఇలాంటిగురుశిష్యులు ఒక చోట ఉంటే – అక్కడ ఆధ్యాత్మికానందం వెల్లివిరుస్తుందనడంలో సందేహంలేదు. ఇద్దరూ అసాధారణులైనపుడుమాత్రమే దివ్య ప్రబోధం సిద్ధిస్తుంది. ఇలాంటివాళ్లనుగూర్చే "ఆశ్చర్యో వక్తా, కుశలోఽ స్యలబ్ధా" అనింది కఠోపనిషత్తు(1–2–7). ఇలాంటి వక్త, శ్రోతలే నిజమైన గురుశిష్యులు.

**సర్వదేవమయుడైన గురువుయొక్క పాదపద్మాల్ని సేవించి, తరించిన మనుషులే పూజ్యులు, కృతకృత్యులు, ధన్యులు.**
**ఒక్కమాటలో చెప్పాలంటే –**
**గురువు మనిషిని మనీషిగా మారుస్తాడు.**

గీతలో భగవంతుడు తనను నిరంతరం భజించే వాళ్లకు–తగిన బుద్ధియోగాన్ని ఇస్తానన్నాడు. ఆ బుద్ధియోగం గురుసాక్షాత్కారరూపంవల్లనే లభిస్తుంది. ఇంతటి విశాలగంభీర భావంలోనే ఉపనిషత్తుల్లో, గురుగీతల్లో గురుశబ్దార్థం వివరించబడింది. గురువు సర్వార్థాల్ని తెల్పేవాడు – అనుగ్రహించేవాడు.

జ్ఞానంవల్లనే ముక్తి కనుక – అలాంటి జ్ఞానదాత గురువు తప్ప మరొక్కడు లేడు. గురువు భగవంతునివలే పరమప్రేమ కలవాడై ఉండాలి. ఈశ్వరునిఅనుగ్రహంకంటే ముందు గురువు అనుగ్రహం ఉండాలి. జీవునికి పూర్వపురుషులతో, అతనివంశీయులతో ఉండే సంబంధమే – గురువుతో శిష్యునికుండే సంబంధం. గురువుపై జిజ్ఞాసువుకు శ్రద్ధ, వినయం, విధేయత, గౌరవం లేనిదే ఆధ్యాత్మికవిద్య వృద్ధికాదు. భాగవతంలో కృష్ణుడు ఉద్ధవునితో **"ఆచార్యం మాం విజానీయాత్, నావ మన్యేత కర్హిచిత్। న మర్త్య బుద్ధ్యా సూయేత సర్వదేవమయో గురుః" (11–17–26)** – "ఉద్ధవా! నేనే గురువునని తెలుసుకో. నన్ను



మానవమాత్రుణ్ణిగా భావించవద్దు. గురువు సకలదేవతామయుడని గుర్తించు" అన్నాడు.

సాక్షాత్తు కృష్ణభగవానుడు– తానే అందరికీ గురువునని చెప్పినా–అవతారంలో గురువులకు సేవలు చేశాడు కదా! మహాత్ములైన గురువులు తమ స్పర్శచేతనే, కేవలం సంకల్పంచేతనే

శిష్యుల్ని పారమార్థికశీలురుగా మార్చగలరు. అట్టి గురువుల ద్వారానే మనం భగవంతుణ్ణి దర్శించగలం. కనుక భగవంతునికీ– మనకూ నిస్స్వార్థమధ్యవర్తి గురువు. మన ప్రార్థనల్ని భగవంతునికి తెల్పి, భగవంతునిఅనుగ్రహాన్ని మనకు అందింపజేయడం గురునికర్తవ్యం.

**"శివే రుష్టే గురు స్త్రాతా, గురౌ రుష్టే న కశ్చన"**– 'శిష్యునిపై శివుడు కోపిస్తే – గురువు శివుణ్ణి శాంతింపజేసి, శిష్యుణ్ణి రక్షి స్తాడు. కానీ గురువే కోపిస్తే – శివుడుకూడా ఏమి చేయలేడ నింది – గురుగీత. (1అ–88శ్లో) గురుభక్తి లేకపోవడం వల్లనే – నేడు దైవభక్తి కూడా తగ్గింది. ఆడంబరాలు పెరిగాయి – ఆత్మీయతలు, గౌరవా దరాలు తరిగాయి.

## ఎంతటి మహారాజైనా....

పూర్వం ఒక మహారాజు ఒక గురుకులఆశ్రమానికి వస్తానని కబురు పెట్టాడు. ఐతే, ఆ గురువు, "మీరు దయచేసి రాకండి! మీరు వస్తే రాజమర్యాదలో భాగంగా నా తలపాగా తీయాల్సి ఉంటుంది. ఇంతవరకు మా విద్యార్థులు నేనే గొప్పవాణ్ణి అని అనుకుంటున్నారు. మీ ముందు నేను తలపాగా తీస్తే– వారిముందు నా ఆధిక్యత తగ్గిపోతుంది. దానివల్ల ఆ తర్వాత క్రమశిక్షణలో తేడా వస్తుంది. పిల్లల భవిష్యత్తు దృష్ట్యా దీన్ని పెద్దమనస్సుతో అర్థం చేసుకోగలరని ఆశిస్తున్నాను." అని విజ్ఞప్తిలేఖ వ్రాశాడు. వెంటనే మహారాజు, "మీ గురుకులానికి నేను వస్తున్నాను. అయితే, రాచమర్యాదలు మీరు పాటించాల్సిన అవసరం లేదు. ఒక ఆదర్శఉపాధ్యాయునిగా మీ పెద్దరికాన్ని గౌరవిస్తూ, నేనే నా కిరీటాన్ని తీసి, శిరసు వంచుతాను." అని జవాబు వ్రాశాడు. అవీ ఆనాడు ఒక ఉపాధ్యాయునికి ఉన్న గౌరవమర్యాదలు!

పూర్వం గురుపరంపరకు ఒక ప్రత్యేక విలువ ఉండేది. కానీ అది వేరు. ఫలానా వాళ్లవద్ద పంచకావ్యాలు చెప్పుకున్నారు. ఫలానా వాళ్లవద్ద పాణిని, ఫలానాచోట శాస్త్రాధ్యయనం చేశారని చెప్పుకునేవాళ్లు. గురుపరంపరకు అత్యంత ప్రాధాన్యత, ప్రామాణికత ఉండేవి. సంగీతంలో గురుపరంపరకు అత్యంతప్రాధాన్యత, ప్రామాణికత ఉండేది. కచేరిలో ఆ క్రమాన్ని చెప్పి, వాళ్లను స్మరించుకునే సంప్రదాయం ఉండేది. కారణం – నాడు కళలు వ్యాపారవస్తువులు కావు.

కచుడు శుక్రుణ్ణీ, ఉదంకుడు పైలుణ్ణీ, ప్రహ్లాదుడు – నృసింహస్వామినీ, హనుమంతుడు శ్రీరాముణ్ణీ – ఇలా ఎందరో మహానుభావులు తమ ఋజుప్రవర్తనవల్లనే గురుదేవుల్ని మెప్పించి, వారిఅనుగ్రహంతో అభీష్టసిద్ధి పొందారు. మన భావాన్నిబట్టే ఫలం ఉంటుంది. గురువులు పరమహంసలుగా ఉండాలేకానీ, పరమహింసకులు మాత్రం కారాదు. పరమహంసలైన మహాత్ములే తాము తరిస్తూ, శిష్యుల్నికూడా తరింపజేసే ఉత్తమ గురువులవుతారు.

మానవజీవితం పవిత్రతరం కావడానికీ, తరించడానికీ– అధ్యయనానంతరం గురువులు శిష్యులకు చెప్పిన హితోపదేశాలు ఉపనిషత్తుల్లో, పురాణాలలో ఉన్నాయి.



క॥ సరగున శిష్యులపాపము,
పరిహరణమొనర్చి, పుత్త్రభావ మునిచి స
త్కరుణను ధన్యుల జేయుట,
ధరణిని గురువులకు సహజ ధర్మముగాదే!

(వర్ణనరత్నాకరం-కుబ్జాకృష్ణ విలాసము)

గురువులు తమ ఉపదేశాలతో శిష్యుల పాపాల్ని పరిహరణం చేస్తారు. అంటే పాపకార్యాలు చేయకుండా చేస్తారు. తమ కొడుకుల్లాగా వాళ్ళను చేరదీసి, అభిమానిస్తారు. దయతో వాళ్ల జీవితాల్ని ధన్యం చేస్తారు. ఇలా

శిష్యుల్ని పుణ్యాత్ములుగా, విద్యావంతులుగా, ఉత్తమవ్యక్తులుగా, జ్ఞానశక్తి సంపన్నులుగా తీర్చిదిద్దడం విద్యోపదేశగురువుల సహజ ధర్మం! ఒక ఉత్తమగురువు శిష్యులపట్ల ఎలా ఉండాలో ఈ పద్యం చక్కగా నిరూపిస్తుంది.

## గురువును అల్లుణ్ణి చేసుకున్నశిష్యుడు

కేతన-తిక్కనప్రియశిష్యులలో ఒకడు. కేతన తన 'దశావతారచరిత్ర' ను తిక్కనకు అంకితం ఇచ్చాడు. అలా తన కావ్య కన్యకను గురువుకు అంకితమిచ్చి అతణ్ణి అల్లుణ్ణి చేసుకున్న శిష్యుడు- కేతన. రాజాశ్రయాలు సాధించి, రాజులకే కావ్యాలు అంకితం ఇచ్చే రోజులవి. గురువుకు శిష్యుడు తనరచనను అంకితం ఇవ్వడం అదే మొదలు. ఆధునికకాలంలో సౌందర నందనాన్ని పింగళి, కాటూరి కవులు తమ గురువైన చెళ్లపిళ్లకు అంకితమిస్తూ - **"కేతనతోటి పొత్తునకు కేల్ కలపన్ తలపోసి కాదు..."** అని సవినయంగా చెప్పుకున్నారు. అదే గురువు - శిష్యుడు విశ్వనాథ చెప్పిన ప్రసిద్ధపద్యం ఇక్కడ చెప్పాలి. ఇది నలుగురూ మరోసారి చదివి విశ్వనాథ నాడిని, వాడిని, వేడిని లేదా ఆ జీవుడివేదనను స్మరించుకోవాలి.

> అల నన్నయ్యకు లేదు తిక్కనకు లేదా భోగము అస్మాదృశుం
> డలఘుస్వాదు రసావతార ధిషణాహంకార సంభార దో
> హల బ్రహ్మీమయమూర్తి శిష్యుడైనాడన్నట్టి దా వ్యోమ పే
> శల చాంద్రీమృదుకీర్తి చెళ్లపిళ వంశస్వామి కున్నట్లుగన్

ఈ పద్యం చదివి, మెచ్చుకుంటూనే, "యింతకూ యిది నా మీద రాసినట్టా, నీ మీద రాసుకున్నట్టా" అని అడిగారట చెళ్లపిళ్ల.

మీరెలా అనుకున్నాసరే- అన్నది శిష్యునిజవాబు. "ఈతడు మాకంటెను పిండికలవాడు" అని చెళ్లపిళ్ల నిండు మనసుతో అంగీకరించిన సందర్భం ఉంది. ఆతరం గురు శిష్యులు, వారిమధ్య అనుబంధాలు, ఆత్మీయతలు ఎలా ఉండేవో చెప్పాలంటే ఈ ఉదాహరణలు చెప్పాల్సిందే కదా!

## కక్షలను అధిగమించిన శిష్యవాత్సల్యం

యుగాలు వెనక్కి వెళితే గురుశిష్యులకు సంబంధించిన ముచ్చట్లు కావల్సినన్ని. ఒక రాత్రివేళ వశిష్ఠాశ్రమంతలుపు చప్పుడైంది. లోపల నుంచి మహర్షి "ఎవరూ.." అని అడిగాడు బిగ్గరగా, "నేనే" అని వినిపించింది బయట నుంచి ఒక యువ కంఠం. "నేనంటే..." అన్నాడు-మహర్షి అర్థంకానట్టు ప్రశ్నార్థకంగా. "అది తెలుసుకోడానికే వచ్చాను గురువర్యా" అన్నాడు



బయటనుంచి రాముడు- వశిష్ఠునిప్రాణశిష్యుడు. తర్వాత రాముణ్ణి సాదరంగా లోనికి ఆహ్వానించి, సందేహనివృత్తిచేసి పంపాడట. ఒక గొప్ప గురువుకు వశిష్ఠుడు ప్రత్యక్ష నిదర్శనంగా నిలుస్తాడు. విశ్వామిత్రుడు రామలక్ష్మణులను తనవెంట పంపమని అడిగినప్పుడు దశరథుడు పలువిధాలా బతిమాలుకుంటాడు. కాని వశిష్ఠుడు రాకుమారులిద్దరినీ పంపమని సలహా ఇస్తాడు. వశిష్ఠవిశ్వామిత్రులకు సయోధ్య లేదు. అయినా విశ్వామిత్రునివద్ద గల అస్త్రశస్త్రాలగురించి వశిష్ఠునికి తెలుసు. ఆ అమోఘాస్త్రాలను, తన వ్యక్తిగత అంశాలను పక్కనపెట్టాడు. శిష్యుడు జగదేకవీరుడు కావాలన్నదే ఆయనలక్ష్యం. పాత కక్షలకంటె శిష్యవాత్సల్యం బలమైంది.

## గురువు లేకుంటే అవతారానికి అర్థమే లేదు

ఇక్ష్వాకువంశానికి గురువూ, పురోహితుడూ రెండూ - వశిష్ఠమహర్షే! ఆ మహర్షి బోధలూ, సూచనలవల్లనే ఆ వంశం మహాకీర్తిమంతం అయింది. శ్రీరామునిధర్మరాజ్యపరిపాలనకు కులగురువైన వసిష్ఠులవారే మూలస్తంభం.

వశిష్ఠునివల్లే రామావతారప్రయోజనాలు సిద్ధించడానికి మార్గం సుగమమయ్యింది. అహల్యాశాపవిమోచనం, సీతా కల్యాణం- ఇలా క్రమంగా రావణసంహారంవరకూ అది ఫలించింది. పట్టాభిషేకముహూర్తం స్వయంగా వసిష్ఠులవారే నిర్ణయించినా- భవిష్యత్తును గుర్తించి, అందులో పట్టాభిషేకం భంగమయ్యే అంతర్గతలోప కూడా చేర్చిన మహాత్ముడు- అతడు. అలా కాకపోతే శాపాలు ఫలించడం, దుష్టశిక్షణం, శిష్టరక్షణం, హనుమంతునిదాసత్వం, సుగ్రీవమైత్రి, వారధినిర్మాణం, రావణ

సంహారం మొదలైన లక్ష్యాలన్నీ నెరవేరి ఉండేవికావు. వసిష్ఠుడు త్రికాలజ్ఞుడు కనుక – రాముణ్ణి అన్నివిధాలా తీర్చిదిద్ది, రామ దేవుణ్ణి చేశాడు. ఇలా చేయడమనేది ఆ గురువులకు ఎవరూ చెప్పింది కాదు. అది వారికి సహజధర్మం!

## బాలరాముణ్ణి కల్యాణరామయ్యను చేసిన గురువు

విశ్వామిత్రుడు తపస్సుతో రాజర్షి, తర్వాత బ్రహ్మర్షి, జగత్కల్యాణకారకులైన సీతారాములకల్యాణానికి ప్రధానకారకుడు. దశరథుడు తన పుత్రులకు వివాహం చేయడానికి సంకల్పించి, బంధు మిత్రులతో, మంత్రులతో సంప్రదించే సమయంలో విశ్వామిత్ర ప్రవేశం జరుగుతుంది. రామాయణంలోని ఈ సన్నివేశం విశ్వామిత్రునికి, సీతారామకల్యాణానికి గల సంబంధాన్ని గుర్తుచేస్తుంది. విశ్వామిత్రుడు రాముణ్ణి తనతో పంపమని అడిగినప్పుడు దశరథుడు రాముణ్ణి చిన్నవాడు కనుక పంపనంటాడు; అంతే కానీ, రామునిపెళ్లిసంగతి మాట్లాడడు. వసిష్ఠునిసలహాతో రామలక్ష్మణుల్ని పంపేటప్పుడైనా విశ్వామిత్రునిదగ్గర వివాహ ప్రసక్తి రాలేదు. యజ్ఞసమాప్తి అనంతరం రామలక్ష్మణులు ఇంటికి తిరిగి వస్తారనుకుని వారివివాహప్రసక్తి తీసుకురాకపోయి ఉండవచ్చు. కానీ విశ్వామిత్రుడు దశరథుణ్ణి సమీపించినప్పుడు వివాహప్రసక్తి సూచనామాత్రంగా,అవ్యక్తంగా ఉంది. యజ్ఞదీక్ష పూర్తయిన తర్వాత రామలక్ష్మణుల్ని మిథిలకు తీసుకువెళ్లాడు విశ్వామిత్రుడు. జనకుడు శ్రీరాముడికి ధనుస్సు చూపేటప్పుడు విశ్వామిత్రుడు "ఓ వత్స! రామ! ధనుస్సును చూడు నాయనా" అని అంటాడు. విశ్వామిత్రుని వాక్యంలోని గూఢార్థం రాముడికిమాత్రమే తెలుసు. రాముని "వత్స రామ" అని సంబోధించడం జరిగింది. "వత్సే రామా యస్య సః" – వత్స రామః వత్సశబ్దానికి వక్షఃస్థలమని అర్థం. "వత్సరామ" అంటే 'వక్షఃస్థలంలో సీత కలవాడా' అని అర్థం రామునికి స్ఫురిస్తుంది. వెంటనే రాముడు ధనుస్సు నెక్కుబెట్టుతాడు. ధనుర్భంగం జరుగుతుంది.



విశ్వామిత్రుడు మిథిలకు వచ్చి, జనకునితో రామలక్ష్మణులకు ధనుస్సును చూపమన్నప్పుడు విశ్వామిత్రుడికి సీతారామకల్యాణల కల్యాణసంకల్పమున్నట్లు పైకి కన్పించకపోయినా, చూపించమనడంలో అంతరార్థమదే. తర్వాత జనకుడన్న మాటలు ఈ విషయాన్ని దృఢపరుస్తున్నాయి.

*యద్యస్య ధనుషో రామః*
*కుర్యాదారోపణం మునే*
*సుతా మయోనిజాం సీతాం దద్యాం దాశరథే రహమ్ ॥*

(బాల - 66-25)

రాముడు ధనురారోపణం చేస్తే సీతనిచ్చి పెళ్లి చేస్తానంటాడు. అంతమంది యోధానుయోధులెత్తలేనిదాన్ని పదహారేళ్ల బాలుడెత్తుతాడని అనుకోవడమెలా! 'అయితే' శ్రీరాముడు చిన్నవాడుగా కన్పించినా అతని నిజతత్త్వాలు జనకుడికీ, విశ్వామిత్రునికీ ఇద్దరికీ తెలుసుకాబట్టి వాళ్లలా అన్నారు.

అయితే సీతాకల్యాణానికీ, శివధనుర్భంగానికీ సంబంధమేమి? బరువైన ధనుస్సునెత్తడం దేహబలానికి సంబంధించిన విషయం. బుద్ధిబలానికక్కడ తావుండదు. అలా దేహబలాన్ని పరీక్షించే ధనుర్భంగపరీక్షను విదేహరాజు ఎందుకు ఏర్పాటు చేసినట్లు? విశ్వామిత్రుడంత బ్రహ్మర్షి ఆ పరీక్షకు శ్రీరాముణ్ణి తీసుకురావడంలో ఆంతర్యమేమి? అనే సందేహాలు మనల్ని వెంబడిస్తూ ఉంటాయి. తత్త్వతః శివధనుస్స్వరూపాన్ని దర్శించినపుడు మన సందేహాలు తొలగిపోతూఉంటాయి.

రామాయణంలో ఏ సన్నివేశాన్నిగూర్చి భావన చేయాలన్నా రామాయణం వేదావతారరూపమనీ, ప్రతి సన్నివేశం ఒకతత్త్వరహస్యాన్ని ఉపదేశిస్తోందనీ మరచిపోకూడదు.

శ్రీరాముడు ఎక్కుపెట్టిన శివధనుస్సు శబ్దబ్రహ్మాత్మకప్రణవం. కథాభాగాన్ననుసరించి శివునిధనుస్సు నెత్తినట్లు కన్పించినా – తత్త్వతః శివధనుర్భంగమంటే నాదతత్త్వదర్శనమే, నాదస్వరూపానందానుభూతియే. ఆ దర్శనం కర్మ భక్తి యోగాల్లో సుపరినిష్ఠితులై, జ్ఞానయోగంలో రాజిల్లుతూ గురుదేవులఅనుగ్రహం సంపా

దించిన మహామహితాత్ములకుమాత్రమే సాధ్యం. అయోనిజ అయిన సీత స్వయంప్రభారూపిణియైన ఉపనిషత్స్వరూపమే. ప్రణవతత్త్వదర్శనం అంటే వేదాంత విజ్ఞాన వైభవానుభూతి లేక బ్రహ్మవిద్యావ్యాప్తి సిద్ధించదు గద! ఆ తత్త్వదర్శనం లౌకికశారీరకబలమున్న రాజపుత్రులకు సాధ్యం కాదు. అది విశ్వామిత్రుని వంటి సద్గురువు అనుగ్రహంవల్ల కృతకృత్యుడైన శ్రీరాముడికి మాత్రమే సాధ్యం. శ్రీరాముడెంత పారమార్థిక ఐశ్వర్యసంపన్నుడైనా సంప్రదాయానుగతసంస్కారక్రమసంపన్నత్వం సాధించడం కోసమే అతడు విశ్వామిత్రశిష్యుడైనాడు. 'కౌసల్యా సుప్రజారామ' మొదలైన గురూపదేశాలు అతని కర్మయోగ ప్రాగల్భ్యాన్ని, అహల్యాశాపవిమోచనం అతని బ్రాహ్మీమూర్తిని సూచిస్తున్నాయి. శ్రీరాముడు అలాంటివాడని గుర్తించిన వాడు కాబట్టే విశ్వామిత్రుడతణ్ణి ధనురారోపణం చేయించాడు.

సీతారాముల కల్యాణంలో దాతా, గ్రహీతా – రెండూ తానే అయి, లక్ష్మణ భరత, శత్రుఘ్నుల వివాహాలుకూడా ఒకే వేదికపై నిర్వహించాడు.

రామాయణంలో విశ్వామిత్రపాత్రస్వరూపాన్ని అర్థం చేసుకుంటే సీతారామకల్యాణాన్ని జరిపించి, ఆనందించేవాళ్లు విశ్వామిత్రులౌతారనీ, వాళ్లను విడదీయదలచినవాళ్లు రావణుని వలే లోకకంటకులౌతారనీ తెలుస్తుంది. కనుక విశ్వామిత్రునికి లక్ష్యం సీతారామకల్యాణనిర్వహణమే. అతడు చేసిన యజ్ఞం కూడా లోకకల్యాణకారకమైన ఈ కల్యాణరూప కార్యసిద్ధికే. ఈ విషయాన్ని విశ్వామిత్రుణ్ణి మొట్టమొదటగా చూచినప్పుడు దశరథుడన్న మాటలు సూచిస్తున్నాయి.

"విశ్వామిత్రునిరాక అమృతప్రాప్తివలే ఉంది. అనావృష్టిపీడితులకు వర్షప్రాప్తివలే, సంతతిలేనివాళ్లకు సంతాన ప్రాప్తివలే, ప్రణష్టమైన దానిలాభం వలే, మహోత్సవసమయంలో హర్ష ప్రాప్తివలే ఉంది" (బా.కా. 18-50 నుండి 52 వరకు)

దశరథునికి పూర్వసన్నివేశాలన్నీ ఒక్కసారిగా స్మృతికి వచ్చాయి. పూర్వం తమదేశంలో కలిగిన అనావృష్టి ఋష్యశృంగుని రాకతో సువృష్టి కలిగింది. అప్పటికదే అమృతప్రాప్తి. సంతానం లేక నష్టమైందని భావించినప్పుడు కలిగిన సంతానం అప్పుడు అమృతాయమానమైంది. విశ్వామిత్రుని అనుగ్రహంతో శ్రీరాముడికి మహోదయం అంటే శుభపరంపర కలుగబోతోందనే సంతోషం ఇప్పుడు అమృతాయమానమైంది. దశరథుని హృదయంలో అప్రయత్నంగా స్ఫురించిన మహోదయమే సీతారామకల్యాణం. విశ్వామిత్రునితో పోయి తన కుమారుడు కల్యాణ రాముడై తిరిగి రావడమే అతడూహించిన మహోదయంలోని హర్షం. ఈ విధంగా విశ్వామిత్రస్వరూపాన్ని భావన చేసినపుడు ఆ మహాత్మునిదివ్యచరిత అందరికీ ఆదర్శప్రాయమై విరాజిల్లుతుంది. రామాయణగాథ లోకంలో ఆరాధించబడినంత కాలం– శ్రీరాముడికి గురువుగా – ఆ మహాత్ముడు ఆరాధింప బడుతూనే ఉంటాడు.

### బంటు గురువైన శుభవేళ....

రామాయణంలో హనుమంతుడు రామదాసే అయినా – సుందరకాండలో పరమాత్మ అయిన రామునివిశేషాలు – జీవాత్మ అయిన సీతకు తెల్పి – ఒక విధంగా ఆ ఇరువురి మన స్తాపాన్ని పోగొట్టిన గురువర్యుడయ్యాడు. కనుక గురుబలం చాలనివారు సుందరకాండ పారాయణం చేయడం, సంసారంలో కష్టాలు వచ్చినపుడు వాటినివారణకై సుందరకాండ పారాయణం చేయడం, అనేకదుఃఖాల నివారణకు సుందరకాండే పరిష్కారమని నమ్మడం ఇదంతా హనుమంతుని గురుత్వ ప్రభావమే!


చిత్రసౌజన్యం : శ్రీ పంచకర్ల రమేష్, హైదరాబాదు

## గురుదక్షిణకోసం...

ఉదంకుడు పైలునిశిష్యుడు. గురుపత్నిఆజ్ఞపై పౌష్య మహాదేవి కర్ణకుండలాలు తెస్తుంటే – తక్షకుడు అపహరించి,



నాగలోకానికి తీసుకెళ్లాడు. ఇతడూ నాగలోకానికివెళ్లి, ఒక దివ్యపురుషునిసాయంతో నాగలోకాన్ని క్షోభపెట్టాడు. భయపడి, తక్షకుడు కుండలాలు ఇచ్చాడు. వాటిని తెచ్చి గురుపత్నికి ఇచ్చాడు. తక్షకుడు తన గురుపత్నికి చేసినద్రోహానికి ప్రతీకారంగా – జనమేజయునితో సర్పయాగం చేయించి, తక్షకునిపై పగతీర్చుకున్నాడు. గురుదక్షిణ చెల్లించడంలో ఎలాంటి కష్టానికైనా శిష్యులు వెనుకాడరనేది ఈకథపరమార్థం".

## గురువుగర్భం నుండి శిష్యుడు

కచుడు దేవగురువైన బృహస్పతికొడుకు. మృతసంజీవని విద్యకై – రాక్షసగురువైన శుక్రునివద్దకు విద్యాభ్యాసానికై వస్తాడు. దేవరాక్షసులకు వైరమైనా – శుక్రుడు – బృహస్పతి అంతటి





వానికొడుకు తనవద్ద చదువుకోవడం – తనకు ప్రతిష్ఠయే కదా అని అంగీకరించి, అన్నివిద్యలూ నేర్పాడు. అసూయాపరులైన రాక్షసులు కచుణ్ణి చంపినా– మరలా బ్రతికించాడు. మరోమారూ చంపి, కాల్చి, బూడిదను మద్యంలో కలిపి శుక్రునిచే త్రాగించారు.

శుక్రుడు యోగదృష్టితో తనకడుపులోని శిష్యుణ్ణి గమనించి, అతణ్ణి సంజీవనితో బ్రతికించి, అతనికి సంజీవనీవిద్యను ఉపదేశించి, తన కడుపును చీల్చుకుని రమ్మనాడు. కచుడు బయటకు వచ్చి, తిరిగి సంజీవనితో గురువును బ్రతికించాడు.

శుక్రునికుమార్తె దేవయాని కచుణ్ణి తన భర్తగా కోరింది. "గురువులకు శిష్యులు పుత్రసమానులనీ, నీవు నాకు సోదరివవుతావనీ, ఇది ధర్మంకాదనీ" తిరస్కరించాడు. దేవయాని శాపానికి గురయ్యాడు. అయినా శిష్యధర్మాన్ని తప్పలేదు. ధర్మవ్యతిరేకాన్ని ప్రోత్సహించలేదు. దేవతలకూ అన్యాయం చేయలేదు. శుక్రునిఇంట అన్నిసేవలూ చేశాడు. సదాచారవంతుడైన శిష్యుడుగా వాసికెక్కాడు.

శిష్యుల బ్రహ్మచర్యాశ్రమానికి కచుడు ఆదర్శంగా నిలిచి, దేవయాని అనుచితప్రేమను తిరస్కరించాడు. శిష్యధర్మ నిగ్రహానికి ఈకథపరాకాష్ఠ.

## తనను చంపేస్తాడని తెలిసినా...

ఆరోజులలో శస్త్రాస్త్రాలు నేర్చుకోవడానికి ఏకైకవిశ్వ విద్యాలయంగా ద్రోణునిగురుకులం శోభించింది. అందులో చదువుకోని క్షత్రియవీరుడు లేడు. శస్త్రాస్త్రవిద్యాభ్యాసం కోరే ప్రతివారూ ద్రోణునిదగ్గరే విద్యనభ్యసించారు. యాజోపయాజుల తపఃప్రభావంతో ద్రుపదుడు కుమారుణ్ణి ద్రోణవధకోసం సంపాదించినట్లు లోకమంతా తెలిసిందే. అలాంటి ధృష్టద్యుమ్నుడే అస్త్రవిద్యాభ్యాసంకోసం ద్రోణుణ్ణి గురువుగా ఆశ్రయించాడు. ద్రోణుడు ఒక క్షణం ఆలోచించి, దైవవిధి ఎట్లైనా తప్పదు, అపకీర్తి ఎందుకని ధృష్టద్యుమ్నుణ్ణి శిష్యునిగా అంగీకరించాడు. తన ప్రాణాలు తీసుకునే ఆయుధాన్ని తానే తయారుచేసిన అపూర్వ గురువు ద్రోణుడు.

అర్జునుడి విషయంలో ధనురాచార్యుడైన ద్రోణుడు చూపిన శిష్యప్రేమ మహోన్నతం. తన కొడుకైన అశ్వత్థామకు కూడా నేర్పని ఎన్నో అస్త్రశస్త్రాల రహస్యాలు – శిష్యుడైన

అర్జునునికి నేర్పాడు. ఇందుకు కారణం అర్జున, అశ్వత్థామల మనస్తత్వాలూ, ప్రవర్తనలే!

అయితే ఏకలవ్యుని విషయంలో మాత్రం ద్రోణుడు లోకనిందను భరించలేక తప్పలేదు.

ఏకలవ్యునికి విద్యనేర్పడానికి ద్రోణుడు నిరాకరించాడు. ఏకలవ్యుడు క్రోధవశగణంలో పుట్టినవాడనీ, అందుచేత అసుర ప్రకృతి కలవాడనీ, భవిష్యత్తులో అతనివల్ల బాధపడాల్సి వస్తుందనీ కృష్ణుడు ముందుగానే మెలకువపడి, ఈ కన్నుతగులుపుల్లను మెల్లగా తొలగించడం మంచిదని ద్రోణునికలాంటి బుద్ధి పుట్టించి, ఆ వీరుణ్ణి వికలాంగుణ్ణి చేయించాడు.

### మట్టిబొమ్మా గురువేనా?

ద్రోణుడిగురుత్వం అలా ఉంచితే -

ఏకలవ్యుడుమాత్రం చాలా గొప్పశిష్యుడు.

ద్రోణుడు విద్యనేర్పనంటే అతడు అరణ్యానికి మరలి వెళ్ళి, ద్రోణాచార్యులవారి మట్టిబొమ్మను తయారుచేసి, ఆ బొమ్మకు భక్తిశ్రద్ధలతో నమస్కరించి, ఆ బొమ్మనెదురుగా పెట్టుకుని విలు విద్యనభ్యసించి మేటి విలుకాడయ్యాడు. ఆ మట్టిబొమ్మ ఏకలవ్య నికి ధనుర్విద్యారహస్యాలు బోధింపగలదా? లేకుంటే ఏకలవ్యుడు తాను ద్రోణాచార్యుల శిష్యుడనని ఎందుకు చెప్పుకున్నాడు? ఏకలవ్యుడు అసత్యమాడాడా? లేదు. అతడు సత్యాన్నే చెప్పాడు. ఆ మట్టిబొమ్మే అతనికి ధనుర్విద్యారహస్యాలు బోధించింది. ఇదే భారతీయ విజ్ఞానంలోని రహస్యం. అంతరాత్మచైతన్యం ఆధారంగా చేసుకుని, దానిఅంశలో వెలుగొందేదే జీవుని అంతఃకరణం. సృష్టిఖండమంతా మనస్సుయొక్క వర ప్రసాదమని భారతీయతత్త్వశాస్త్రాలు చెబుతున్నాయి. మనిషి తనమనస్సులో ఒక జడపదార్థంలో చైతన్య విశేషాన్ని భావిస్తే ఆ జడపదార్థమే చైతన్యమూర్తియై తనను భావించిన భావుకునికి భావనావైభవాన్ని అందిస్తుందని భారతీయశాస్త్రాలు ఘంటాపథంగా చెబుతున్నాయి.

**మంత్రే తీర్థే చ దైవే చ దైవజ్ఞే భిషజౌ గురౌ**
**యాదృశీ భావనా యత్ర సిద్ధి ర్భవతి తాదృశీ**



మంత్రంలోను, తీర్థంలోను, దేవునిలోను, జ్యోతిష్కునిలోను, వైద్యునిలోను, గురువులోను ఎవరికెలాంటిభావం కలుగుతుందో వారికి అలాంటి సిద్ధే కలుగుతుంది. ఇలా ఏకలవ్యుడు ముమ్మాటికీ ద్రోణాచార్యుల శిష్యుడే. అతడు అర్జునునికంటే మేటివిలుకాడే, తన శిష్యులలో అర్జునుణ్ణి అధికునిగా చేస్తానన్న ప్రతిజ్ఞకు భంగం వాటిల్లింది. సత్యానికి కట్టుబడే ఏకలవ్యుడు తాను ద్రోణుని శిష్యుణ్ణని చెప్పుకొన్నాడు. ద్రోణుడుకూడా, అర్జునునిపట్ల తాను చేసిన వాగ్దానసత్యానికి కట్టుబడి గురుదక్షిణగా ఏకలవ్యుని కుడిచేతిబొటనవ్రేలు కోరాల్సివచ్చింది.

ఇక్కడ అత్యంతముఖ్యమైన ధర్మశాస్త్రరహస్యం. ఒకటుంది. అదేమంటే వేదం గురువుదగ్గర చదువకుండా నేర్చుకోకూడదు. (మనుస్మృతి 2-116) ఎవడు అభ్యాసనిమిత్తం వల్లించేవాని దగ్గరనుండి గాని, మరొకనికి చదువు చెప్పేవాని దగ్గరినుండీ గాని అతనిఅనుమతి లేకుండా వేదాన్ని అభ్యసిస్తే వాడు వేదాపహరణ అనే పాపంవల్ల నరకానికిపోతాడు. కనుక ఏ శిష్యుడైనా సాక్షాత్తు గురుముఖతఃగానే ఏ విద్యనైనా అభ్యసించాలి. ఇందుకు మహాభారతం ఆరణ్యపర్వం తృతీయాశ్వాసంలో వచ్చే యవక్రీతు చరిత్రే నిదర్శనం.

**క॥ గురుముఖమునఁ బడయక దు**
**ష్కరతపమునఁ జేసి, వడయఁగాఁబడు విద్యల్**

పరమార్థము మదమును మ
త్సరమును గావించు నెట్టి సాధులకైనన్ (ఆరణ్య. 3-256)

కః గురుశుశ్రూష మొనర్చుచుఁ
బరమక్లేశమునఁజేసి పడసిన విద్యల్
స్ఫురియించుఁ గాక గురుముఖ
విరహితముగఁ బడసినవియు వెలయునె యెందున్
(ఆరణ్య. 3-282)

అందుచేత గురుశుశ్రూష చేయకుండా లభించిన విద్య సర్వథా అనర్థదాయకం, కనుకనే ఏకలవ్యుడు గురుశుశ్రూషాదులు లేకుండా పరోక్షంగా నేర్చినవిద్య నిరర్థకం కావాల్సి వచ్చింది.

ద్రోణుడు కాదన్నా ఏకలవ్యునికిమాత్రం అంత పట్టుదల ఎందుకు? అతడు సామాన్యనిషాదుడు కాదు. ఉత్తమక్షత్రియుడే. అందుకే ఆ అభినివేశం. ఏకలవ్యుడు శ్రీకృష్ణుని ఐదుగురు మేనత్తలలో ఒకరైన శ్రుతదేవకొడుకని, కానీ నిషాదులలో పెరిగాడని హరివంశం (పూర్వభాగం-3, అ.159-160)లో ఉంది. ఏది ఏమైనా ఏకలవ్యుని ఉదంతం ద్రోణుడికి అపకీర్తిని తెచ్చిందే!

## అందరూ గురువులు కారు, కాలేరు!

ధర్మరాజు సింహాసనం అధివసించి, కొన్నాళ్లు పాలించాక ఒకనాడు కృష్ణునితో "రక్తబంధువులను, గురువులను, స్నేహితులను సంహరించిన పాపిని, పశ్చాత్తాపంతో నా గుండె ఉడుకుతున్నది. రాజ్యం విడిచి అరణ్యానికి పోయి, తపస్సుతో తనువు చాలించాలని ఉంది." అన్నాడు. వెంటనే కృష్ణుడు "ధర్మనందనా! ఎంత అవివేకం! ఇదంతా నీ తెలివి అనుకుంటున్నావా? సరే, ఒక్కమారు మీ తాతగారిని చూచి వెళ్లవచ్చు. రేపు ఆయన దర్శనం చేసుకుందాం." అన్నాడు.



మరునాడు పాండవులతో కృష్ణుడు భీష్ముణ్ణి సమీపించాడు. అందరూ ఆయనకు పాదాభివాదం చేసి, తలవంచుకు నిలబడ్డారు. అప్పుడు శ్రీకృష్ణుడు "మీ మనవడికి రాజధర్మం, మానవనీతి, మీ వంశమర్యాదలు బోధించు." అన్నాడు.

భీష్ముడు చిరునవ్వు నవ్వి "శ్రీకృష్ణా! ఎందుకయ్యా ఈ వయసులో అంపశయ్య మీద ఉన్న నాతో పరిహాసం ఆడుతున్నావు?" అన్నాడు. వెంటనే నందనందనుడు "తాతా, ఇందులో పరిహాసం ఏమున్నదయ్యా?" అన్నాడు.

"జగద్గురువైన నీ సమక్షంలో నేను ధర్మబోధ చెయ్యడం అసహ్యం కాదుటయ్యా!" అన్నాడు- భీష్ముడు.

శ్రీకృష్ణుడు "తాతా, నేను జగద్గురువునే. కానీ నా బోధలు వీరికి వంటబట్టవు. పాఠం చెప్పడానికి కావలసిన జీవితానుభవం నీకు ఉంది. శాస్త్రజ్ఞానంలో మనకు భేదం లేదు. జీవితంలో లోకానుభవం నీకంటే ఎవరికుంది? శాస్త్రజ్ఞానంతో లోకానుభవాన్ని, కాలాన్నీ మేళవించి, చెప్పగలవాడే గురుపీఠం అధివసించాలి." అన్నాడు - భీష్ముడు అందుకు అంగీకరించి "నీ ఆదేశానుసారం బోధిస్తాను. అయితే ఎక్కడైనా నేను పొరబడితే సవరిస్తూండాలి." అన్నాడు.

ఈ సన్నివేశాన్ని కొంచం మనసుపెట్టి చూడగలిగితే గురుపీఠంయొక్క విశిష్టత బోధపడుతుంది.

జగద్గురువైన శ్రీకృష్ణుడంతటివాడు భీష్మునిముందు నిలబడి- ప్రపంచంలో ప్రతివ్యక్తికీ గురుస్థానం ఇవ్వకూడదనీ, శాస్త్రజ్ఞానానికి లోకానుభవం జోడించి, తలపండినవాడే పాఠం చెప్పాలనీ. తల పండేసరికి ఉద్యోగం తీసేసి, విశ్రాంతికి పంపే వ్యవస్థ ఈనాడు తాండవించడంవల్లనే విద్యారంగం ఇంత అధ్వాన్నంగా తయారయిందని చెప్పుకోవచ్చు

చదివినదాన్ని కక్కడం కాదు-గురువు చేయవలసింది! దాన్ని జీర్ణించుకుని, వంటబట్టిన దాన్ని మననం చేసుకుంటూ, దానికి తన అనుభవాన్ని కలిపి, నిస్స్వార్థంగా బోధించగల ఉపాధ్యాయులు అరుదైపోయారు.

సంతలో దొరికే చింతపండు, ఉల్లిపాయలూ కాదు– విద్య అంటే. మనస్సును వికసింపజేస్తూ బుద్ధిని సక్రమంగా నడుపుతూ, నీతినీ, నడవడికనూ అలవరిచే విద్యావేత్తలు పాఠశాలల్లో రావాలి.

ఇదీ భారతం గురువుకిచ్చినస్థానం! భారతం నేర్పిన పాఠం!

అనంతరం భీష్మపితామహునినోట వెలువడిన ప్రబోధం శాంతి, అనుశాసనపర్వాలుగా అందింది.

ఈ రెండుపర్వాలలో ఆయన చేసిన ప్రబోధం గ్రహిస్తే– తల్లిగర్భంనుండి నేలమీదపడి కెవ్వుమని ఏడిచింది మొదలు, కాటిమీద పెట్టి మనచుట్టూ ఉన్న వారందరూ భోరుభోరున ఏడిచేవరకూ మానవుడైనవాడు అడుగుతీసి అడుగు ఎలా వెయ్యాలో, పెదవి కదిపి ఎలా మాట్లాడాలో, ఎలా నడుచుకోవాలో తెలుస్తుంది. మానవత్వానికి పరిపూర్ణత సిద్ధించి, తల్లితో, తండ్రితో, గురువుతో, స్నేహితులతో, శత్రువులతో, భార్యతో, బిడ్డలతో ఎవరితో ఎలా ప్రవర్తించాలో అవగాహన అవుతుంది.

## జగద్గురువైనా గురువుముందు శిష్యుడే...

శ్రీకృష్ణుడు, బలరాముడు దేవతలే అయినా–గురుసేవతో విద్యలు నేర్వాలని సాందీపనిఆశ్రమం చేరుతారు. అక్కడ 64 రోజుల్లో, 64 విద్యలూ నేర్చారు. వేదాదిసకలశాస్త్రాలు అధ్యయనం చేశారు. గురుపత్ని వంటకట్టెలు తెమ్మంటే మిత్రుడైన కుచేలునితో పాటు కృష్ణుడూ వెళ్లాడు. కుంభవర్షంలో రాత్రంతా తడిశారు. అయినా గురుపత్ని వంటలో ఇబ్బంది పడకూడదని తలంచి, ఎండుకట్టెల్ని ఎట్లో రక్షించి, గురుపత్ని ఆజ్ఞలను సఫలం చేశారు. గురుదక్షిణగా – మరణించిన తన కుమారుణ్ణి తెచ్చిఇమ్మని గురువు కోరగా – యమలోకానికి వెళ్లి, యముణ్ణి మెప్పించి, గురుపుత్రుణ్ణి దక్షిణగా ఇచ్చి, గురువును సంతోషపరచాడు. స్వయంగా భగవంతుడే అయినా – గురువుకంటే తక్కువవాడే అనే సంగతిని కృష్ణుడు తన గురుభక్తితో, సేవలతో నిరూపించాడు.

## గురువు రాయబారిగా మారినవేళ...

భాగవతంలో దశమస్కంధం ఆయువుపట్టు. ఈ దశమస్కంధంలో పూర్వోత్తరభాగాలని మళ్లీ రెండు. పూర్వభాగాన్ని రుక్మిణీకల్యాణం దగ్గర పూర్తిచేస్తారు. రుక్మిణీకల్యాణం విన్నంత మాత్రంచేత, రుక్మిణీకల్యాణం చేసినందువల్ల, చూచినందువల్ల, చదివినందువల్ల కలిగేఫలితం చెప్పడానికి మాటలు చాలవు. రుక్మిణీకల్యాణం చదివితే కచ్చితంగా యోగ్యుడైనవరుడు కన్యకు వచ్చి తీరుతాడు. రుక్మిణీకల్యాణం జగత్కల్యాణం.

రుక్మిణీకల్యాణంలో అగ్నిద్యోతనుడనే బ్రాహ్మణుడు – రుక్మిణికి చేసిన సహాయం మహోన్నతమైంది. అతడు గురువూ, పురోహితుడూ, సహృదయుడూ, ఉదారహృదయుడూ. శ్రేయస్సు నిజంగా కోరి, చేయూత ఇచ్చే వాళ్లందరూ గురుమూర్తులే! జీవాత్మ అయిన రుక్మిణిని, పరమాత్మ అయిన కృష్ణునితో చేర్చిన ఉత్తమసందేశగురువు – అగ్నిద్యోతనుడు. ఎట్టి ప్రతిఫలాన్నీ ఆశించకుండా తన ధర్మాన్ని చక్కగా ఆచరించి, కృష్ణునిచే గౌరవమర్యాదలు పొందాడు. లక్ష్మీదేవియైన రుక్మిణితో నమస్కారాలు పొందాడు.

క్రిందినుండి చూచేవారికి అగ్నిలా కనిపించేవాడు పైనుండి చూచేవారిక జ్యోతిలా కనిపించేవాడు సద్గురువు, అగ్నిద్యోతనుడు అలాంటి గురువు. ఆత్మజ్ఞానాన్ని తన శిష్యులకు బోధించదానికి ఆయన నిరంతరం ప్రయత్నిస్తుంటాడు. ఆబోధ గ్రహించగల సామర్థ్యం గల శిష్యులకోసం ఆ గురువు అన్వేషిస్తుంటాడు. అలాంటి శిష్యుల్ని తరింపజేస్తుంటాడు. అలాంటి గురువునే రుక్మిణీదేవి ఆశ్రయించింది.



రుక్మిణీసందేశం ప్రకృతిసందేశం, ప్రకృతిఆరాటం. మానవత దివ్యత్వాన్ని అందుకునేందుకు చేసే ప్రయత్నం. ఈ ప్రయత్నాన్ని పురుషుడిదగ్గరకు తీసుకువెళ్లి, సఫలం చేసిన గురువు అగ్నిద్యోతనుడు.

## శ్రీకృష్ణుడి తర్వాత....

మహాభారతకాలంలో శ్రీకృష్ణుడు ఎలా అన్నిరంగాల్లో సమాజాన్ని తీర్చిదిద్ది, ప్రవృత్తినివృత్తి రూపధర్మాన్నీ, ఆధ్యాత్మిక తత్త్వాన్నీ, నిష్కామకర్మనిర్వహణనూ, ఆరాధనావిశిష్టతను ఎలా ప్రచారం చేశాడో – నేటికి 2000 ల సం॥ల పూర్వం సాక్షాత్ శంకరుడే ఐన శంకరాచార్యులవారు – అదే కృషి చేశారు. కృష్ణుడు కొంతయుద్ధం, సంహారంకూడా చేపట్టాడు. కానీ శంకరుడు తన రచనలద్వారా, ప్రబోధాలద్వారా, వేదాంతసమన్వయం ద్వారా, భాష్యాలద్వారా, స్తోత్రాలద్వారా ఆసేతుహిమాచలం సంచరించి, మానవజీవన విధానంలోని చెడును తొలగించి, సనాతన వైదికజీవన విశిష్టతను పెంపొందించాడు. షణ్మతస్థాపనం చేసి,



ఎవరిఇష్టదైవాన్ని వాళ్లు ప్రశాంతంగా పూజించుకొనే ఏర్పాటు చేసి, ఆస్తిక్యాన్ని సరైనమార్గంలో సంస్థాపించాడు.

మొట్టమొదటగా జీవబ్రహ్మైక్యరూపమైన అద్వైతస్థితిని లోకానికి నిరూపించాడు. ఆ తర్వాత ఆ మార్గాన్ని రెండుగా చేసి ద్వైతం, మూడుచేసి, విశిష్టాద్వైతంగా ఇతరగురువులు బలపరచారు. మతాలూ, సిద్ధాంతాలూ, ప్రచారాలూ వేర్వేరుగా పైకి కన్పించినా నదులన్నీ సాగరంలో కలిసినట్లు – అన్నీ చివరకు పరమాత్మలో చేరేవిషయంలో భేదం లేదు. గమ్యం అదే! గమ్యాన్ని చేరడానికి త్రిమతాచార్యులు త్రివిధమార్గాలు చూపించారు. ఎవరికి ఇష్టమైనమార్గంలో వాళ్లు పయనించి, గమ్యం చేరవచ్చు. అందుకే మొట్టమొదటి జగద్గురువు శ్రీకృష్ణుడు కాగా, తర్వాతి జగద్గురువు శంకరాచార్యులైనారు. క్రమంగా ఈ గురుత్వగౌరవం విస్తృతమైంది.

జగద్గురువుల బోధలు జగత్తుకంతా వర్తించి, అందర్నీ నిజమైన మానవులుగా తీర్చిదిద్దాలి. అపుడే జగద్గురుత్వం సార్థకమవుతుంది. ఏది ఏమైనా భారతజాతికి వ్యాసుడూ, కృష్ణుడూ, తర్వాత గొప్పధార్మిక, ఆధ్యాత్మికసేవ చేసిన మహనీయులలో చెప్పుకోదగ్గవారు శ్రీశంకరాచార్యులే!

## రాజిల్లు వీణ కల్గు గురురాయ

వాగ్గేయకారుల్లో త్యాగరాజు స్థానం విశిష్టతను పొందింది. త్యాగయ్యకు మొదటి సంగీతగురువు శొంఠివేంకటరమణయ్య. గురుకృపవల్ల స్వల్పకాలంలోనే సంగీతజ్ఞానం పొందాడు. శ్రీరామకృష్ణానందులవారు త్యాగరాజుకు నారదమంత్రాన్ని ఉపదేశించారు. ఆ మంత్రాన్ని భక్తిశ్రద్ధలతో అనుష్ఠించాడు.

నారదుడు సన్న్యాసివేషంలో వచ్చి 'స్వరార్ణవ' మనే గ్రంథాన్ని ఇచ్చి, వెళ్లాడు. అందులోనే 'నారదీయ' మనే తాళపత్రకోశం ఉండింది. అపుడు వీటిల్ని ఇచ్చింది – నారదమునే అని గ్రహించి, ఆ గ్రంథాలు చదివి, సందేహాలు తీర్చుకొన్నాడు.

కృతజ్ఞతతో "రాజిల్లు వీణ కల్గు గురురాయ", "శ్రీనారద నాదసరసీరుహభృంగ", "నరనారద నారాయణ" అంటూ నారద పంచరత్నకీర్తనలు రచించాడు. "స్వరరాగ సుధారసభక్తి స్వర్గాపవర్గమురా" అనే కీర్తనలో నాలుగోచరణంలో "రజతగిరీశుడు నగజకు దెల్పు స్వరార్ణవ మర్మములు, విజయము గల త్యాగరాజు కెఱుకే–విశ్వసించి తెలుసుకో మనసా!" అని కృతజ్ఞతా పూర్వకంగా నారదుణ్ణి నుతించాడు.

ఉంఛవృత్తితో జీవిస్తూ, సుమారు నలభైమంది శిష్యుల్ని పోషించాడు – త్యాగయ్య. వాళ్లందరూ తమ గురువును. 'అయ్యగారు' అంటూ ఎంతోభక్తితో సేవించి, అయ్యగారి కీర్తనల్ని యథాతథంగా – అయ్యగారు పాడినట్లే – ఈనాటికీ, ఎప్పటికీ రూపం మార్చలేనివిధంగా గానం చేసేటుగా శిష్యపరంపర ఏర్పడింది. ఈ రకమైన శిష్యపరంపర వాగ్గేయకారుల్లో ఉండడం చాలా అరుదు.

శిష్యోత్తముడైన వాలాజపేట వేంకటరమణయ్య తమ గురువును నుతించిన "వేదవేదాంగ చర్చల్లో త్యాగయ్య వ్యాసుడు. మృదుమధురపద గుంభనంలో వాల్మీకి, సాహిత్యంలో బ్రహ్మ, సంగీతంలో నారదుడు, భక్తివిషయంలో ప్రహ్లాదుడు, అంటూ చివరకు రామనామజపంలో శివుణ్ణికూడా జయించాడన్నాడు. ఇలా కీర్తితుడు కావడం త్యాగయ్యకే దక్కినఘనత.

త్యాగయ్యగారి గురుత్వానికి ప్రత్యక్షనిదర్శనం, త్యాగయ్య అనంతరం – బెంగళూరు నాగరత్నమ్మ తన ఆస్తి, సొమ్ములు అమ్మి, అయ్యగారిసమాధిని ఆలయంగా నిర్మించింది. త్యాగయ్య సహస్రారకమలాన్ని ఛేదించుకొని, రామపరమాత్మలో చేరిన చివరిగడియల్ని శిష్యులందరూ చూచారు. ఇంతటి భక్తి, వైరాగ్యం, శిష్యగణం కల్గడం, సీతారామలక్ష్మణహనుమంతులు ప్రత్యక్షంకావడం – త్యాగయ్య గురుపీఠానికి వన్నె తెచ్చాయి. ఒక సంగీతగురువుకు ఈనాటికీ జరుగుతున్న ఉత్సవాలు, కీర్తి కిరీటాలు. ఆనాటి ఆ గురుశిష్యుల అనుబంధం అద్వితీయం!

సమర్థరామదాసు – తనశిష్యుడైన శివాజీని తీర్చిదిద్ది, హైందవమహాసామ్రాజ్యాన్ని నిర్మింపజేయడం అందరికీ తెలిసిందే! అట్లే తిమ్మరుసు కృష్ణరాయల్ని, విద్యారణ్యులు విద్యానగరాన్ని నిర్మించడం, ఇవన్నీ చారిత్రకసత్యాలు. గురువులై కేవలం అంతర్ముఖులుగానే ఉండక – ధార్మికసమాజనిర్మాణం కోసం అహర్నిశలూ తమ తపస్సును ధారవోసిన త్యాగమూర్తులయ్యారు. వీళ్లకు స్ఫూర్తి వశిష్ఠ, విశ్వామిత్ర, వ్యాసాదులే!

ఇట్లే సాహిత్యంలోనూ ఎందరో గురువులు తమ శిష్యుల్ని మహాకవులుగా, మహాపండితులుగా, మహావధానులుగా తీర్చిదిద్ది ఉన్నారు.

**ఆచార్యః పూర్వరూపమ్ । అంతేవా స్యుత్తర**
**రూపమ్ । విద్యా సంధిః । ప్రవచనం సంధానమ్**

**(తైత్తిరీయ ఉపనిషత్తు శిక్షావల్లి-3-2)**



భారతదేశాన్ని ఎన్నటికీ ప్రపంచదేశాల్లో ఆధ్యాత్మిక, సాహిత్య, ధార్మిక, భక్తి, జ్ఞాన, వైరాగ్య, త్యాగాదివిషయాల్లో ఆదర్శంగా నిల్పేది – సమున్నతమైన గురుపరంపరయొక్క ఆత్మశక్తియే! ఇది ఒక్క భారతీయులకే దక్కిన అనర్ఘగౌరవం!

శిష్యుడు వేదశాస్త్రాలు అధ్యయనం చేశాక – ఆ గ్రంథాన్ని స్మరిస్తూండే బుద్ధీ, దాని అర్థం త్వరగా తెలుసుకోవడం కష్టం కనుక. అందుకు అవసరమైన శక్తి కల్గడానికి తగిన ఉపాసన ఇందులో చెప్పబడింది. ఈ క్రమంలో ఆచార్యుడు (గురువు) పూర్వరూపం. ఉత్తరరూపం–శిష్యుడు. ఇరువురినీ కల్పేది – విద్య. ఇందుకు సంధానం– ప్రవచనం. అంటే విద్యావిషయంలో గురువుది ప్రధానపాత్ర. శిష్యునిది తర్వాతి పాత్ర. ఆ పాత్రను నింపేది– విద్య. ఆ విద్య ప్రవచనమనే వస్తువుల ద్వారా– శిష్యుణ్ణి జ్ఞానవంతుణ్ణి చేస్తుంది.

ఇలా నిరంతరం గురుశిష్యులు అధ్యాపనం, అధ్యయనం ద్వారా జ్ఞానాన్ని అభివృద్ధి చేసుకొంటూ విద్యా తపస్సును కొనసాగిస్తారు.






ద్రవిడవేదమైన నాలాయిర దివ్యప్రబంధానికి ఓంకారం లాంటి పల్లాండు దివ్యప్రబంధం ప్రభవించి, ప్రప్రథమంగా పాడబడిన పవిత్రదివ్యస్థలం మథుర. మథురకు 70 కి.మీ. దూరంలో తిరుక్కోట్టియూర్ ఉంది. ఇక్కడ వేంచేసిన పెరుమాళ్లు- సౌమ్యనారాయణ స్వామివారు, తాయారు- తిరుమామ కళ్నాచ్చియార్. ఇక్కడి ఆలయం మూడుఅంతస్తులుగా ఉంది. గర్భాలయంపై దిక్కుకు రెండుచొప్పున నాలుగుదిక్కులలో వెరసి ఎనిమిది విమానాలున్నాయి. గర్భాలయంపై ఉండే ఈ ఎనిమిది విమానాల సమూహాన్ని కలిపి అష్టాంగవిమానం అంటారు. అష్టాక్షరీమంత్రానికి అష్టాంగవిమానం సంకేతంకాగా అష్టాక్షరి మంత్రంలోని మూడుపదాలకూ మూడు అంతస్తుల దేవాలయం ప్రతీకగా దర్శనమిస్తుంది. అష్టాక్షరీమంత్ర రహస్యజ్ఞాన పూర్ణుడు గోష్ఠీపూర్ణుడు ఇక్కడ విలసిల్లటం విశేషం. ఇది తిరుక్కోట్టియూర్ నంబి అవతారస్థలం. ఇక్కడ తిరుక్కోట్టియూర్‌నంబికీ, రామానుజులవారికీ వేరువేరుగా ప్రత్యేకసన్నిధులు ఉన్నాయి. ఈ దివ్యదేశజనపదాన్నంతా చూస్తున్నట్లు ఆలయగోపురంపై రామానుజులవారి దివ్యసుందరమూర్తి దర్శనమిస్తుంది. **అష్టాంగ విమానం, అష్టాక్షరీమంత్రం, మూడుఅంతస్తుల ఆలయం, అష్టాక్షరీమంత్రరహస్య జ్ఞానప్రపూర్ణుడు గోష్ఠీపూర్ణుడు, గోపురంపై రామానుజులవారి దివ్యసుందరమూర్తి- ఇవన్నీ పరస్పరం ఒక దానితో ఒకటి సంబంధం కలిగిన ప్రతీకాత్మకమైన ప్రత్యేక విశేషాలు.**

శ్రీరామానుజులవారు శ్రీరంగంలో ఉంటారు. వారి గురువులలో ఒకరైన పెరియనంబి/మహాపూర్ణుల ఆదేశానుసారం రామానుజులవారు తిరుక్కోట్టియూర్‌కువెళ్లి అక్కడ ఉండే తిరుక్కోట్టియూర్‌నంబిని గురువుగా పొంది. వారిదగ్గర అష్టాక్షరీమంత్ర చరమశ్లోకరహస్యార్థాలను తెలుసుకొనేందుకు తయారౌతాడు.

రామానుజులవారు మొట్టమొదటసారిగ గోష్ఠీపురం వెళుతాడు. అక్కడ తిరుక్కోట్టియూర్‌నంబిని దర్శించి, సాష్టాంగదండ ప్రణామాలు చేస్తాడు. తనను కరుణించి శిష్యునిగా గ్రహించి తిరుమంత్రోపదేశం చేసి దాని రహస్యార్థాలను చరమశ్లోక అంతరార్థాలనూ అనుగ్రహించమని నంబిని అభ్యర్థిస్తాడు. రామానుజులవారిని పరీక్షించాలనుకుంటాడు నంబి. అందువల్ల రామానుజులవారిని మరొకపర్యాయం రమ్మంటాడు- నంబి. రామానుజులవారు శ్రీరంగం తిరిగి వెళతాడు. మరికొంత కాలానికి నంబిని దర్శిస్తాడు. నంబి మునుపు చెప్పిన రీతిగానే రామానుజులవారిని మళ్లీ రమ్మంటాడు. రామానుజులవారిలో పట్టుదల ఎక్కువౌతుంది. దానితోపాటు గురుభక్తి, మంత్రార్థాన్ని తెలుసుకోవాలనే ఆసక్తి ఇంకా ఎక్కువౌతుంది. ఇలా 17 పర్యాయాలు తిరుగుతాడు- రామానుజులు. వారికి ఎలాంటి విసుగూ పుట్టలేదు. పద్దెనిమిదవపర్యాయంకూడా ఆచార్యులసన్నిధికి వెళ్లి, మంత్రరహస్యార్థాన్ని అనుగ్రహించమని మోకరిల్లుతాడు. రామానుజులవారిభక్తిప్రపత్తులకు, సహనానికి నంబి సంతోషిస్తాడు. **18**వ సారి రామానుజులవారికి **అభీష్టజయం** కలుగుతుంది.

## మంత్రరహస్యార్థప్రబోధం

తిరుక్కోట్టియూర్‌నంబి శుభముహూర్తాన రామానుజులవారికి సంప్రదాయబద్ధంగా మంత్రోపదేశంచేసి, రహస్యార్థం అనుగ్రహిస్తారు. ఈ కార్యక్రమంలో రామానుజులవారికి పవిత్ర, త్రిదండసమానులైన కూరేశ, దాశరథి అనేవారుకూడా పాల్గొంటారు. రామానుజులవారితో నంబి ఇలా చెప్తాడు -

“మానవశక్తిని ఉద్దీపనంచేసి, గురుతరమైన శక్తిని కలిగించే రహస్యాన్ని మంత్రం అంటారు. మనుష్యుల మానసికశక్తిని పెంపొందించేవాటిలో శ్రేష్ఠమైంది మంత్రం. ప్రత్యేకమైన శబ్దంలో ఒక విశిష్టమైన శక్తి అంతర్నిహితమై ఉంటుంది. అది ఉచ్చారణ వల్ల ప్రకటితమౌతుంది. శబ్దోచ్చారణంవల్ల వాయుమండలంలో

కంపనం మరియు స్పందన కలుగుతుంది. ఆ ప్రభావం ఆ శబ్దం విన్నవారిపై పడుతుంది. ఉచ్చారణ చేసేవాళ్ల స్థాయినిబట్టి ఆ శబ్దం/ మంత్రం తన ప్రభావాన్ని చూపిస్తుంది. ఒకరాజు ఒక శబ్దాన్ని ఉచ్చరిస్తే దేశమంతా ఆదేశంగా స్వీకరిస్తారు. ఒక ఉత్తమవక్తశబ్దోచ్చారణ మహాసభను ఆకట్టుకొంటుంది. మంత్రం అనగానే ఏదోమాయ అనుకోవటం సరికాదు. మంత్రవిద్య ఒక మనోవైజ్ఞానికపద్ధతి. మంత్రంయొక్క చిత్రాత్మకరూపం యంత్రం కాగా, క్రియాత్మకరూపం తంత్రం. విశిష్టాద్వైతమతంలో అష్టాక్షరీమంత్రానికి విశిష్టస్థానం ఉంది. దీన్నే తిరుమంత్రం అంటారు. మూడుపదాలు, ఎనిమిదిఅక్షరాలు కలిగిన ఈ మంత్రాన్ని గోప్యంగా ఉంచు. స్తోత్రాలైతే అందరూ వినేటట్లు కూడా పారాయణం చేయవచ్చు. మంత్రాన్ని ప్రయత్నించి గోప్యంగా ఉంచాలి / జపించాలి. **మంత్రం యత్నేన గోపయేత్.** జీవితంలోని చివరిదశలో ముఖ్యమైన శిష్యునికిమాత్రం మంత్రం ఉపదేశించవచ్చు. నియమోల్లంఘనం చేస్తే నరకం ప్రాప్తిస్తుంది.” ఇలా మంత్రరహస్యవిశేషాలను నంబిగారు రామానుజులవారికి చెప్పి, ఆశీర్వదించి సెలవు ఇస్తారు.

### గోపురమెక్కి గోప్యమంత్రాన్ని వెల్లడిచేయడం

రామానుజులవారు గురువుగారికి మోకరిల్లి, వారిసన్నిధి వదలి, అష్టవిమాన విలసిత ఆలయం ప్రక్కన వెళుతూ ఉంటాడు. అపుడు రామానుజులవారిమదిలో ఒక ఆలోచన మెదలుతుంది. రామానుజులవారిహృదయం విశ్వమంత విశాలమయింది. అందరినీ పెరుమాళ్లఅనుగ్రహానికి పాత్రులను కావించాలని భావిస్తారు. సమాజంలోని వారందరినీ సముద్ధరించాలనీ, తన ఒక్కడికీ నరకం వచ్చినా ఫరవాలేదనీ, ప్రజలందరికీ పుణ్యం కలగాలనీ అనుకుంటాడు-రామానుజులవారు. ఆలయం పక్కన నడుస్తూ రామానుజులవారు ప్రజలందరినీ రమ్మని పిలుస్తాడు. వారిపిలుపువార్త నిమిషాలలో ఊరంతా వ్యాపిస్తుంది. ప్రజలందరూ తండోపతండాలుగా అక్కడికి చేరుకుంటారు. అపుడు రామానుజులవారు ఆలయప్రాకారగోపురంపై నిలబడి “ప్రజలారా! నాకు ఒక నిక్షేపం లభించింది. అది మీ కందరకూ పంచుతా. విశ్వసంపదకు భాగస్వాములారా! సోదరమానవులారా! నాకు లభించిన పెన్నిధి తిరుమంత్రం. ఈ అష్టాక్షరీ మంత్రాన్ని మీకు ఉపదేశిస్తాను. దాన్ని నిత్యం జపించండి! తరించండి!! ఆ మంత్ర మీ అందరికీ పుణ్యాన్నిస్తుంది. భక్తియుక్తంగా పలుకండి - ***ఓం నమో నారాయణాయ - ఓం నమో నారాయణాయ - ఓం నమో నారాయణాయ*** - అంటూ ప్రజలందరికీ సామూహికంగా మంత్రాన్ని రహస్యార్థాన్నీ అనుగ్రహిస్తారు-రామానుజులు. ప్రజలంతా భక్తితో ఎలుగెత్తి తిరుమంత్రాన్ని పరమానందభరితులై ఉచ్చరిస్తారు. అష్టాక్షరీమంత్రధ్వనితో తిరుక్కోట్టియూర్ పవిత్రశబ్దప్రకంపనలతో అతిశయిస్తుంది.

### నంబిఆగ్రహం

మిన్నంటిన కలకలానికి తిరుక్కోట్టియూర్ నంబి తన కుటీరంనుంచి బయటకు వస్తారు. ఆబాలగోపాలం ప్రజాసముద్రం అష్టాక్షరీమంత్రోచ్చారణ చేస్తూ పరమానందంగా ఉండటాన్ని చూశారు-నంబి. ఆయన ఆలయం దగ్గరకు వచ్చి “రామానుజా! ఇదేమిటి? నేను చెప్పిందేమిటి? నీవు చేసిందేమిటి? గురుద్రోహీ! గోప్యమంత్రాన్ని గోపురమెక్కి అందరకూ బహిరంగంగా వెల్లడి చేస్తావా?! నీవు పాపివి.” అంటూ కోపంతో సింహంలా గర్జించాడు.

### రామానుజుల సమాధానం

రామానుజులవారు నంబికి సాష్టాంగనమస్కారం చేసి, చేతులు జోడించి నిలబడి, వినయంగా “గురువర్యా! అష్టాక్షరీ మంత్రం పరమపదప్రాప్తిని కలిగిస్తుందనటం సత్యం. నేను మీ ఆజ్ఞను అతిక్రమించాను. తిరుమంత్రాన్ని బహిరంగంగా ప్రకటించడంవల్ల నాకు నరకం వచ్చినా ఫరవా లేదు. స్వార్థంతో తిరుమంత్రాన్ని దాచుకోలేకపోయాను. ఇంతమందికి పుణ్యం వస్తున్నప్పుడు నేనొక్కడినీ నరకానికి పోతే ఏమవుతుంది? లోకకల్యాణం కోసం నా సంసారజీవితసౌఖ్యాలను సైతం త్యజించి సన్న్యసించాను. స్వీయమోక్షాన్నికూడా పరిత్యజిస్తాను. సమాజసముద్ధరణమే నాకు ముఖ్యం” అందుకే **అందరికీ అష్టాక్షరి** చెప్పాను” అంటాడు.

### యతిరాజులు ఎంబెరుమానార్ కావటం

తిరుక్కోట్టియూర్ నంబికి రామానుజుల మాటలు విని జ్ఞాననేత్రం వికసిస్తుంది. మూఢాచారాల పొగమబ్బులు తొలగిపోయాయి. **ఎంబెరుమా నార్!** (మా ప్రభువా!/ మమ్మేలువాడా!) అంటూ గోష్ఠీపూర్ణులు రామానుజులను గాఢాలింగనం చేసుకొంటాడు. నంబి– “రామానుజా! నన్నుద్ధరింప వచ్చిన ఆచార్యుడవు నీవు. నీవు వైష్ణవహృదయుడవు. లోకకల్యాణంకోసం అవతరించిన అనంతమూర్తివి. నేను సంకుచితహృదయంతో ఆలోచించాను. నీవు ఆచార్యులకు ఆచార్యుడవు. నీ జీవితయాత్రను నీ లక్ష్యసిద్ధికోసం సాగించు” అంటూ ఆశీర్వదించి పంపిస్తాడు.

ప్రజలందరూ “జయహో ఎంబెరుమానార్! జయ జయహో ఎంబెరుమానార్!!” అంటూ రామానుజులవారిని కీర్తిస్తారు.





# గురుదేవో భవ!

- ఆచార్య సి.వి.బి.సుబ్రహ్మణ్యం,
94400 55415

**విద్య ఆనందాత్మకం. దాన్ని ఆర్జించేవాడు, బోధించేవాడు సమాజానికి ప్రాణంలాంటివారు. ఆ ప్రాణవాయువే కలుషితమైన సమాజం కుళ్ళిపోదా? గురువులో దైవాన్ని దర్శించేభావన భారతీయం. అటువంటి గురుశిష్య పరంపర కొనసాగిన భారతీయం మహాత్ముల వెల్లువను సృష్టించింది.**

బంగారం గొప్పదే. ఇనుమును బంగారంగా మార్చే పరసువేది ఇంకా గొప్పది. దానికంటే గురువు గొప్పవాడు. పరసువేది ఇనుమును బంగారంగా మారుస్తుంది. కాని పరసువేదిగా మార్చట్లేదు. గురువు శిష్యుణ్ణి మరో గురువుగా మారుస్తున్నాడు. కానీ, గురువు తనను తాను గురువుగా భావిస్తే ఆయన బరువయ్యే ప్రమాదం ఉంది. గురువులో శిష్యుడు దైవాన్ని దర్శిస్తే గురువు నుండి జ్ఞానం ప్రసరిస్తుంది. మనం దైవాన్ని దర్శించినపుడు గురువుగారికి తెలీని విషయాలు కూడా గురువుగారి నోటిద్వారా దైవమే చెప్పి శిష్యుణ్ణి సంతృప్తుణ్ణి చేస్తాడు. శిష్యుడు గురువుని మనిషిగానే భావన చేస్తే ఇద్దరు భావనచేస్తే ఇద్దరుమనుషుల ఏకాభిప్రాయం ఎక్కడా ఉండదు. కాబట్టి గురువు అన్నదానినల్లా శిష్యుడు ఖండించే ధోరణిలో ఆలోచించి జ్ఞానాన్ని అందుకోలేకపోతాడు. కానీ, గురువులో శిష్యుడు దైవాన్ని దర్శించినపుడు విద్యావంతుడు గానో, ఆ విద్యను సమాజహితానికి వినియోగించే మహాత్ములు గానో రూపొందుతాడనడంలో సందేహం లేదు.

మన ప్రాచీనవిద్యలను అర్జించిన పండితులంతా విశ్వహితకారులుగా రూపొందడానికిదే కారణం. గురువులో దైవాన్ని దర్శించాలి అని శిష్యునికి ఎవరు బోధించాలి? ఒకవేళ గురువే బోధిస్తే, తనలో దైవాన్ని దర్శించడమంటున్నా డేమిటి? అలా చూస్తే దైవమైపోతాడా! అని వ్యతిరేకించే ధోరణి ప్రబలే అవకాశం పుష్కలంగా ఉంది. గురువు తాను చెప్పకుండా తనలో దైవాన్ని శిష్యుడు దర్శించాలంటే ఏం చేయాలి? దైవలక్షణాలు అలవరచుకోవడం, మాతృహృదయం కలిగి ఉండడం, తాను శిష్యునిలో దైవాన్ని దర్శించడం అనే చర్యలను ఆచరిస్తే గురువు చెప్పనవసరం లేకుండానే శిష్యునికి గురువులో దైవాన్ని దర్శించాలనే స్ఫూర్తి కలుగుతుంది. మాతృహృదయం అంటే పాశ్చాత్య జ్యోతిషంలో దశమంలో తండ్రి, చతుర్థంలో తల్లి గోచరిస్తారు. భారతీయ జ్యోతిషంలో నవమంలో తండ్రి, చతుర్థంలో తల్లి గోచరిస్తారు. నవమానికి ఏడవభావం తృతీయం అవుతుంది. భారతీయ జ్యోతిషంలోనే పంచమంలో తండ్రిని చూసే భావన కూడా ఉంది. అలా చూసినప్పుడు 11లో తల్లిని చూడాల్సి వస్తుంది. మొత్తం పైన 3, 4, 11 భావాల స్వభావం తల్లితో నిక్షిప్తమై ఉంటుంది. 3- సహకారానికి, 4-సుఖప్రదంగా విద్యను ఆహారాన్ని అందించినంత సులభంగా అందించడానికి, 11-లాభప్రదంగా వీని జీవితాన్ని తీర్చిదిద్దడానికి సంకేతంగా భావించవచ్చు. ఓ పెద్దాయన "ఏమిచ్చినా ఖర్చయిపోతాయి. విద్యాదానం చేస్తే జీవితాంతం వానికి తిండి పెట్టినట్లే" అన్నాడు. అదే లాభ ప్రదత్వం అంటే.

ఇక తల్లి యొక్క స్వరూపాన్ని గమనించాలంటే విద్యార్థిలోని విశేషగుణాలను మెచ్చుకునే ధోరణి తండ్రిలో కనిపిస్తే, లోపాలను ప్రేమతో పూరించే ధోరణి తల్లిలో కనిపిస్తుంది. నిజానికి, అరవైమంది విద్యార్థులున్న క్లాసులో ప్రథముడిగా వచ్చిన ఒక వ్యక్తికి బహుమానం ఇచ్చి మెచ్చుకోవడం పితృలక్షణమైతే, మార్కులు తక్కువవచ్చిన యాభైతొమ్మిది మందిని ప్రేమతో అక్కునచేర్చుకోవడం తల్లిలక్షణం. అలా లోపాలను ప్రేమతో పూరించే లక్షణం గురువులో ఉంటేనే అతడు సరియైన బోధకుడు కాగలుగుతాడు. లేకుంటే

ఒకణ్ణి మెచ్చుకొని, యాభైతొమ్మిదిమందిని బాధించే బాధకు డవుతాడు. ఈ దృక్కోణంలో మంచి లక్షణాలను అలవరచు కుంటూ, శిష్యునికి మార్గదర్శకుడై శిష్యుని శారీరక, మానసిక, భౌతికసమగ్రతలకు పాటుపడుతూ అతనిలోనే దైవాన్ని దర్శించి, అతనికి బోధించడమే ఒక తపస్సుగా, దైవసేవగా మలచుకొన్న వ్యక్తి దైవాత్మకుడైన గురువుగా భాసిస్తాడు. అలాంటి గురువులో ఏ శిష్యుడు దైవాన్ని స్మరించకుండా ఉంటాడు? అలా పరస్పరమూ దైవాత్మభావన చేసే గురుశిష్యులే సమాజానికి హితకరులైన విద్యావంతులవుతారు.

గురువుకు శుశ్రూష చేసి విద్య నేర్చుకోవాలి. శుశ్రూష అనే పదం చాలా విచిత్రమైంది. ఎదుటవ్యక్తి ఏ క్షణంలో ఏ విషయాన్ని బోధిస్తాడో ఆ విషయాన్ని మనం కోల్పోకూడదు అనే తపనతో వెన్నంటి ఉండి అంతేవాసిగా విద్యనార్జించే లక్షణం శుశ్రూషలో కనిపిస్తుంది.

**శ్రోతుమిచ్ఛా శుశ్రూషా** – వినడానికి సిద్ధపడి ఉండడం అనే లక్షణమే విద్యనార్జించి పెడుతుంది. ఆ వినడంలోనే ఆతనికి సేవచేయడమనే భావన కూడా నిక్షిప్తమై ఉంది. అందుకే ఆ అర్థాలు వ్యాప్తిలో ఉన్నాయి. అలా శుశ్రూష చేస్తేనే విద్య ఒంటబడుతుంది. అలా కాని పక్షంలో గురుదక్షిణ రూపంలో పుష్కల ధనాన్నివ్వాలి. కృష్ణుడు ఆరంభంలో నవరత్నఖచితగృహాన్ని, మధ్యభాగంలో పరి పూర్ణమైనసేవను అందించి కూడా చివరలో స్వామీ



గురుదక్షిణగా మీకేం ఇమ్మంటారు అని అడిగి మరణించిన కుమారుని బహుమానంగా అందించాడు. అందరూ అలా మరణించిన కుమారుని బ్రతికించలేకపోయినా ఆ స్థాయి లోసేవకు పూనుకుంటే తప్ప విద్య ఒంటబట్టదు. అది చిలుకపలుకుల్లా వచ్చినా హితకారి కాదు అన్న భావన ఆ గాథ ద్వారా తెలుస్తుంది.

పండితలోకంలో ద్రోణాచార్యుని చర్య విమర్శలకు గురైంది. కారణమేమంటే ఇంటికి వచ్చి చదువు చెప్పిన మొదటి ఘనుడు ద్రోణుడు. గురువును ఆశ్రయించడం కాకుండా, గురువే రాజాశ్రయాన్ని పొందిన స్థితి వల్ల దుర్యోధనుని అధర్మప్రవృత్తిని కూడా ఆమోదించి, అతని పక్షాన ఇష్టం లేకున్నా యుద్ధం చేయాల్సిన దుస్థితిని పొందాడు. మొత్తంపై శిష్యునిలో దైవాన్ని దర్శించే ఘనతను సాందీపని చేసి చూపాడు. వశిష్ఠుడు రామునికి గురుత్వం వహించడం కోసమే అరవై తరాలపాటు ఇక్ష్వాకు వంశానికి గురువుగా కొనసాగాడు. అలా కొనసాగినవారు శిష్యునిలో దైవాన్ని దర్శించడం మనకు నేర్పుతున్నారు. దాన్ని గ్రహించక పోవడం మన పొరబాటు.

**హంసతూలికా తల్పాలపై పెరిగే**
**మహారాజైనా గురువుల ఆశ్రమానికి వెళ్లి**
**ఆయన పెట్టే ప్రసాదాన్ని భుజించి,**
**అడవిలో చెట్టుకింద శయనించి,**
**విద్యనార్జించేవారు భారతీయులు.**
**వశిష్ఠాశ్రమానికి వెళ్లి విద్యలనార్జించిన**
**రాముడు యోగవాశిష్ఠం కూడా విని**
**విద్యాసమగ్రతను పొంది తరువాతే రాజ్యార్హుడైనాడు.**
**కృష్ణునంతటివాడు మునివాటికలో సాందీపని**
**వద్ద విద్యనార్జించి లోకపూజ్యుడైనాడు.**
**అంటే సాక్షాత్తు దైవావతారాలు విద్య లేనివీ, రానివీ కావు.**
**అయినా, తక్కినవారికి మార్గదర్శకంగా వారు**
**గురుశుశ్రూష చేశారు.**

**ఈశ్వరో గురురాత్మేతి మూర్తిత్రితయ రూపిణే,**
**ఆనందాత్మ స్వరూపాయ దక్షిణామూర్తయే నమః.**



# ఆగష్టు, 2016 రాశిఫలాలు

బ్రహ్మశ్రీ తంగిరాల వేంకటకృష్ణపూర్ణప్రసాద సిద్ధాంతి,
తి.తి.దే. ఆస్థానసిద్ధాంతి, రేలంగి



**మేషం:** గ్రహస్థితి అనుకూలం. వృత్తివ్యాపారాల్లో పోటీ అధికం కావడంవల్ల స్తబ్దత ఏర్పడుతుంది. చేసే ప్రయత్నాలలో విపరీతజాప్యం. ప్రయాణాల్లో జాగ్రత్త అవసరం. ధనవ్యయం, ఋణాలతో అవమానం. అష్టమ కుజ, శనిదోషపరిహారార్థం సుబ్రహ్మణ్యేశ్వర మరియు పరమేశ్వరుణ్ణి పూజించాలి.



**వృషభం:** ప్రథమార్ధంలో గ్రహస్థితి మిక్కిలిఅనుకూలం. చేసే ప్రయత్నాలు సఫలం, కుటుంబసౌఖ్యం, మాతృవర్గీయుల సహాయసహకారాలు లభిస్తాయి. ద్వితీయార్ధంలో అనారోగ్యం, మనోవిచారం. అప్పుల బాధలు, శరీరఆరోగ్యం అంతంతమాత్రం. దోషపరిహారార్థం ఈశ్వరాభిషేకం చేయడం మంచిది. అంగారకస్తోత్రపఠనం మేలు కలిగిస్తుంది.



**మిథునం :** గ్రహస్థితి గత మూడుమాసాలవలే అనుకూలం. వృత్తివ్యాపారాలలో అభివృద్ధి కొనసాగుతుంది. చాలాకాలంగా సాగుతున్న కోర్టువ్యవహారాల్లో విజయం. ఇంకా శత్రుజయం, నూతనమిత్రపరిచయాలు. చేసేప్రయత్నాలలో సఫలత. వ్యాపారస్థులకు విశేషలాభ సూచన. గృహంలో మరమ్మత్తులు, నిర్మాణాది పనులుచేస్తారు. ఆదిత్యహృదయపారాయణం మంచిది.



**కర్కాటకం:** గ్రహస్థితి అనుకూలం. వృత్తివ్యాపారాలలో అభివృద్ధి, విశేషధనలాభం. వాదోపవాదాల్లో పైచేయి. బంధుమిత్రులతో విందువినోదకాలక్షేపం. విద్యార్థులు కోరిన కళాశాలలో సీటు వస్తుంది. దేహమందు వ్రణాలు, పీడలు, అనారోగ్యం, హృదయసంకటం, వేళకానివేళ భోజనం చేయడం సంభవిస్తాయి. నవగ్రహాలలో కేతుగ్రహఆరాధన మంచిది.



**సింహం :** గ్రహస్థితి శుభాశుభమిశ్రమం. ప్రథమార్ధం గతమాసంవలే అనుకూలం. ద్వితీయార్ధంలో వృథా ప్రయణాలు. ఆదాయానికి మించిన వ్యయం, అనారోగ్యం, వృత్తివ్యాపారాలలో సమస్యలు కలుగుతాయి. చేసే ప్రయత్నాలలో విపరీతజాప్యం,నిరాశ నిస్పృహలు. గృహంలో శుభకార్యంసందడి, అందరినీ ఆదరణగా చూడగలుగుతారు. గత సంవత్సరం నుండి నిలచిన కార్యక్రమాలు నెరవేరుతాయి. గురుధ్యాన్యం మంచిది.



**కన్య:** గ్రహస్థితి ప్రథమార్ధం గతమాసంవలే విశేష అనుకూలం. చేసే ప్రయత్నాలలో సఫలత, మిత్రలాభం. ఇంట్లో శుభకార్యనిర్వహణం. ద్వితీయార్ధం ప్రయాణాలు, ఆదాయానికి మించివ్యయం. పూర్వార్ధం అనుకూలం. చేసేపని కలసివస్తుంది. విద్యార్థులకు అనుకూల సమయం. ఆదాయానికిమించిన ఖర్చు. గురుదత్తాత్రేయఆరాధన మంచిది.



**తుల :** గ్రహస్థితి మిక్కిలి అనుకూలం. బంధుమిత్రుల సహాయసహకారాలు లభిస్తాయి. కార్యసిద్ధి కలుగుతుంది. ఆరోగ్యంకోసం ధనవ్యయం. అనారోగ్య సమస్యలు. శివాభిషేకాలు మంచివి. ఇంట్లో శుభకార్యాలు జరుగుతాయి. గతంలో స్తంభించినపనులు కొలిక్కి వస్తాయి. సర్వత్రా విజయం.



**వృశ్చికం :** గతమాసంవలే ఈ మాసం కూడ కొంచెం ప్రమాదకరం. ద్వితీయార్ధం నుండి వృత్తి వ్యాపారాలలో క్రమంగా పరిస్థితులు అనుకూలిస్తాయి. ఆర్థిక స్థితి క్రమక్రమంగా చక్కబడుతుంది. మిశ్రమ ఫలితాలు. మిత్రుల సహాయం పొందుతారు. ఈ రాశివారు రుద్రాభిషేకాలు చేసుకోవడం, ఋణవిమోచక అంగారకస్తోత్రం పారాయణం చేయడం మంచిది.



**ధనుస్సు :** ప్రథమార్ధం సామాన్యం. ద్వితీయార్ధంలో స్థిర, చరాస్తుల క్రయవిక్రయాదులు లాభిస్తాయి. పితృవర్గీయుల సహాయసహకారాలు. ఇంకా ఇష్టదేవతా సందర్శనం, ఇంట్లో వ్రతాలు జరుపుకుంటారు. బంధుమిత్రుల సహాయసహకారాలు ఉంటాయి. ధనవ్యయం, ఆరోగ్యం అంతంతమాత్రం. వీరు శనీశ్వరునికి తైలాభిషేకం, చేయడం సుబ్రహ్మణ్య ఆరాధనచేయడం మంచిది.



**మకరం :** గ్రహస్థితి మిక్కిలి ప్రతికూలం. ఇంటా, బయట కలహాలు. ఇతరుల వ్యవహారాలలో జోక్యంతో కష్టం, అశాంతి, అవమానం కలుగుతాయి. కుటుంబంలో అసౌఖ్యం, ధనవ్యయం. ధాన్యం వ్యాపారం కలిసి వస్తుంది. ఇతరత్రా వృత్తులు, చేతివృత్తులవారికి కలిసి వస్తాయి. కళత్రఆరోగ్యం విషయమై శ్రద్ధ అవసరం. దుర్గా, శ్రీ మహాలక్ష్మిఅష్టోత్తరపారాయణం మంచిది.



**కుంభం :** ప్రథమార్ధం గ్రహస్థితి అనుకూలం. కళత్రసౌఖ్యం, బంధుమిత్రులతో విందువినోద కాలక్షేపం, మృష్టాన్న భోజనప్రాప్తి. వృత్తివ్యాపారాలలో అనుకూలత, ఆనందం కలుగుతుంది. ద్వితీయార్ధంలో కుటుంబకలహాలు, వృత్తివ్యాపారాలలో చిక్కులు, సమస్యలు కలుగుతాయి. ఉత్తరార్ధంలో అనారోగ్యం, శ్వాసకోశసంబంధపరీక్షలు, వైద్యులసలహాలు తీసుకుంటారు. దైవానుగ్రహం ఉంది. సుబ్రహ్మణ్యఅభిషేకం మంచిది.



**మీనం :** గ్రహస్థితి ప్రథమార్ధం ప్రతికూలం. కుటుంబ కలహాలు కలుగుతాయి. ద్వితీయార్ధం అనుకూలం. వృత్తి, వ్యాపారాలలో అభివృద్ధి. ధనలాభం కలుగుతుంది. శత్రుజయం, మిత్రలాభం మరియు చేసే ప్రయత్నాలలో సఫలత కలుగుతుంది. యత్నకార్యసిద్ధి. సంతోషం, ధనధాన్యవృద్ధి. జ్ఞాతి విరోధాలు కలుగుతాయి. తండ్రి ఆరోగ్యంలో జాగ్రత్త అవసరం.

08






## అడ్డం

1) శివుడు (7)
7) బాధ (2)
8) శుక్రాచార్యుని జామాత (3)
9) ఆందం (2)
12) సుగ్రీవసచివుడు (3)
13) వ్యాసుని శిష్యుడు (3)
17) సూర్యతనయుడు (2)
18) గొప్పతనం (3)
19) దీపపువత్తి (2)
22) మన్మథుడు (7)

## నిలువు

2) మాట (2)
3) ధూమకేతువు (4)
4) భార్య (2)
5) సుగ్రీవుడు (3)
6) పడమర (3)
10) ఉపసుందుని అన్న (3)
11) సుగ్రీవుని అనుచరుడు (3)
14) బలిభార్య (3)
15) పుష్పసుగంధం (4)
16) శుక్రమాత (3)
20) స్వప్నం (2)
21) సాహిణి (2)

**నిర్వహణ**
బి.వి.ఎస్.ఎస్.సుబ్రహ్మణ్యం

జవాబులు
ఈ సంచికలోనే ఉన్నాయి.

అన్వేషించి....
సరిచూసుకోండి.

- ప్రధాన సంపాదకుడు

# శ్రీనివాసమంగాపురం, శ్రీ కల్యాణ వేంకటేశ్వరస్వామి ఆలయ విచారణ ప్రశ్నావళి

**01) ఇక్కడ మొబైల్‌ఫోన్ల డిపాజిట్ కౌంటర్ సౌకర్యంలేదు. నేను ఫోన్ ఎక్కడ జమ చేయాలి? నేను గుడిలోకి ఫోన్ తీసుకువెళ్ళచ్చా?**

**జ.** అవును. ప్రస్తుతం మొబైల్‌ఫోన్ డిపాజిట్ సౌకర్యం లేదు. ఇప్పుడు ఒక కౌంటర్ నిర్మాణనికి ప్రతిపాదన ఉంది. మీ ఫోన్‌ను స్విచాఫ్ చేసి గుడిలోకి తీసుకెళ్లవచ్చు.

**02) లడ్డు, వడ, దోసె ప్రసాదాలు డబ్బులిచ్చి పొందవచ్చా? ఒకవేళ దొరకదు అంటే కారణం తెలుసుకోవచ్చా?**

**జ.** ఈ ఆలయం భారత ప్రభుత్వ పురావస్తుశాఖ, వారి అధీనంలో ఉంది. అదనపు ప్రసాదాలను చేయించడానికి పోటు సరిపోదు. వేరొక పోటు (వంటగది) నిర్మాణానికి కాని, ప్రస్తుత పోటుస్థలాన్ని పెంచడానికి కాని అనుమతి లేదు.

**03) శ్రీవారి కల్యాణోత్సవం 1 గం॥కు పరిసమాప్తం అవుతుంది. భక్తులలో చక్కెర వ్యాధిగ్రస్తులు ఉంటారు. గుడి సమీపంలో ఎక్కడా మంచి భోజన శాలలు లేవు. పద్మావతి అమ్మవారి ఆలయం, ఇతర ఆలయాల వలే, శ్రీనివాసమంగాపురంలో కూడా కల్యాణోత్సవం చేయించే గృహస్థులకు అన్నప్రసాదాల వితరణ సౌకర్యం ఎందుకు కల్పించటం లేదు?**

**జ.** ఈ సౌకర్యం కల్పించడానికి ప్రతిపాదన ఉంది. కానీ, ఇందుకు కొంత వ్యవధి కావలసి ఉంది.

**04) మేము తెల్లవారుజామున జరిగే వివిధ సుప్రభాతసేవ, తోమాలసేవలాంటి సేవలలో పాల్గొనాలని అనుకుంటున్నాం. ముందురోజు రాత్రి వేళల్లో బస చేయడానికి శ్రీనివాసమంగాపురంలో తి.తి.దే. విశ్రాంతి గదులు ఉన్నాయా?**

**జ.** అన్ని సౌకర్యాలు గల తి.తి.దే. విశ్రాంతిగదులు ప్రస్తుతానికి లేవు. త్వరలో ఏర్పాట్లు చేస్తాం.

**05) శ్రీనివాసమంగాపురంలో తలనీలాలు ఇవ్వడానికి తి.తి.దే. కల్యాణకట్ట ఉందా?**

**జ.** లేదు.

**06) ఉచిత యాత్రిక నివాససముదాయాలు ఉన్నాయా?**

**జ.** ప్రస్తుతం లేవు. కాని వాటి ఏర్పాట్లకు సన్నాహాలు చేస్తున్నాం.

**07) మాకు అనుకూలమైన రోజులకు ముందస్తుగా 'మేల్చాట్ వస్త్రం' టిక్కెట్టు పొందే సదుపాయం అమలులో ఎందుకు లేదు?**

**జ.** ప్రస్తుతం అటువంటి అనుకూలత లేదు. భవిష్యత్తులో అమలుపరచడానికి ప్రయత్నిస్తున్నాం. ఇప్పటికైతే, మీరు మీ అనుకూలతేదీల విన్నపాన్ని ఇవ్వండి. దానికనుగుణంగా మేము ఏర్పాట్లు చేస్తాం.

ఈ కూపను కత్తిరించండి




**తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి**

## సప్తగిరి
(ఆధ్యాత్మిక మాసపత్రిక)



## చందా నమోదు పత్రం

1. పేరు మరియు చిరునామా :
   (విడి విడి అక్షరాలలో అర్థమయ్యేలా వ్రాయండి. మరియు పిన్‌కోడ్ తప్పక వ్రాయండి)
   (పిన్‌కోడ్ తప్పని సరి)
   సెల్ నెం.
2. కావలసిన భాష : ☐ తెలుగు ☐ తమిళం ☐ కన్నడం ☐ హిందీ ☐ ఇంగ్లీషు ☐ సంస్కృతం సంవత్సరచందా మాత్రమే
3. సంవత్సర/జీవిత చందా : ☐ రూ. 60/- ☐ రూ. 500/-
4. చందా పునరుద్ధరణ :
   (అ) చందా నెంబరు : (ఆ) భాష :
5. చెల్లించిన మొత్తం :
   డి.డి.నెం. : తేది :
   (చెక్కులు స్వీకరించబడవు)

ప్రదేశం :
తేది : చందాదారుని సంతకం

ఇతర వివరాలకు ఫోన్ నెం.0877-2264543, 2264359


Edited and published on behalf of T.T.Devasthanams by Dr. C.Saila Kumar, M.A.,Ph.D., Chief Editor, T.T.D. and printed at T.T.D. Press by Smt M.Gowthami, M.B.A., Dy. E.O.,(Publications & Press), T.T.D, Manager, T.T.D., Press, Tirupati - 517 507.

